## చైర్మన్‌తో ముఖాముఖి





సూకారపు సూర్యప్రకాశరావు
చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక

**ప్ర: పేదలకు కారుచౌక ధరలకు మందులను పంపిణీ చేస్తామని అట్టహాసంగా ప్రారంభించిన జనరిక్ మందుల విక్రయశాలలు ఎందుకూ పనికిరానివిగా తయారవుతున్నాయి. వైద్యులు రాసిచ్చే మందులు ఈ షాపుల్లో లభించ డంలేదు? అసలు జనరిక్ మందులు అంటే ఏమిటి? వాటి ఉపయోగాలేమిటి?**

**-సి.హెచ్.విద్య, ఏలూరు**

జ: జనరిక్ మందుల విక్రయానికి 2008లో ప్రారంభించిన జన ఔషధి పథకం కింద ఎనిమిది రాష్ట్రాల్లో తెరిచిన 175 జన ఔషధి దుకాణాల్లో 81 నిరుడు జూన్‌కు మూత పడ్డాయి. జన ఔషధి ఛత్రం కింద ఆంధ్రప్రదేశ్‌లో ప్రారంభమైన జీవన్‌ధార దుకాణాలు కూడా సరిగ్గా పని చేయడం లేదు. వైద్యులు జనరిక్స్‌ను సిఫార్సు చేయకపోవడం ఒక్కటే దీనికి కారణం కాదు. ఈ దుకాణాల్లో అన్ని మందులూ దొరక్కపోవడమూ పెద్ద లోపం. జన ఔషధి దుకాణాలకు ప్రభుత్వరంగ ఫార్మా కంపెనీలు మందులను సరఫరా చేయాల్సి ఉండగా, ఆ కంపెనీలు అన్ని వ్యాధుల చికిత్సకు మందులను అందించలేవు. అందుకే అనేక జన ఔషధి విక్రయశాలల అరలు ఖాళీగా ఉండేవి. అక్కడికీ ప్రైవేటు ఫార్మా కంపెనీల నుంచి జనరిక్స్‌ను కొనడానికి టెండర్లు పిలిచినా, చివరి క్షణంలో వాటిని రద్దుచేశారు. తమిళనాడు, రాజస్థాన్, హరియాణా, కేరళ వంటి రాష్ట్రాల్లో ప్రభుత్వా సుపత్రులే ఉచితంగా మందులు ఇవ్వడం వల్ల అక్కడ జన ఔషధి ప్రయోగం విఫలమైంది. అన్నింటినీ మించి వైద్యులు బ్రాండెడ్ మందులు రాస్తే, దుకాణాలు వాటికి బదులు జనరిక్స్‌ను విక్రయించడం చట్ట రీత్యా నేరం. దీన్ని సరిదిద్ది వైద్యులు తప్పనిసరిగా జనరిక్ మందులనే రాసేలా చూడటానికి ఒక బిల్లు తీసుకురావాలని కేంద్ర ప్రభుత్వం యోచిస్తున్నట్లు తెలిసింది. బిల్లును ప్రవేశపెట్టే లోపు జన ఔషధి పథకానికి చురుకు పుట్టించాలని కేంద్రం సంకల్పించింది. ఈ ఏడాది మార్చికి 21 రాష్ట్రాల్లో 253 జన ఔషధి దుకాణాలు పనిచేస్తుండగా, వీటి సంఖ్యను 2017 చివరి కల్లా 3000కు విస్తరించాలని, 2000 కొత్త రక్త శుద్ధి (డయాలసిస్) కేంద్రాలను నెలకొ ల్పాలని 2016-17 కేంద్ర బడ్జెట్ ప్రతి పాదించింది. జన ఔషధి దుకాణాల్లో 577 ప్రాణరక్షక మందులు, 250 వైద్య పరికరాలను విక్రయిస్తారు. కొత్త జన ఔషధి కేంద్రాల్లో వెయ్యి దుకాణాలను ఆంధ్రప్రదేశ్‌లోనే నెలకొల్పుతామని కేంద్ర ఆరోగ్య శాఖ మంత్రి జేపీ నడ్డా తెలియజేశారు. రాష్ట్రంలో ప్రతి 50 వేలమందికి ఒక జన ఔషధి దుకాణం ఉండేట్లు చూడాలని ప్రభుత్వం యోచిస్తోంది. నేడు పలు రోగాలకు భారతదేశం రాజధానిగా మారుతున్న దృష్ట్యా జన ఔషధిని పకడ్బందీగా అమలుచేసి రోగులను ఆదుకోవాలి. వాడవాడలా ఈ దుకాణాలు తెర వాలి. 2014 చివరినాటికి భారతదేశంలో 4.1 కోట్ల మధు మేహ రోగులు, 5.7 కోట్ల హృద్రోగులు, 22 లక్షల మంది క్షయరోగులు, 11 లక్షల క్యాన్సర్ రోగులు, 25 లక్షలమంది హెచ్.ఐ.వి/ ఎయిడ్స్ రోగులు ఉన్నారు. వయోజనుల ప్రతి ముగ్గు రిలో ఒకరు రక్తపోటుతో బాధపడుతున్నారు. నరేంద్ర మోదీ ప్రభుత్వ హయాములో 58 శాతం హృద్రోగ మందులు, 21 శాతం మధుమేహ మందులను ధరల నియం త్రణలోకి తెచ్చారు. అయితే ధరల నియంత్రణ పరిధిలోని మందులు మరీ ఎక్కువగా ఉన్నాయని, వాటి జాబితాను తగ్గించి, కొత్త పరిశోధనలను ప్రోత్సహించడానికి జాతీయ ఔషధ విధానాన్ని సమూలంగా మార్చేయాలని కేంద్రం సంక ల్పించింది. దానికి ముందు ప్రాణరక్షక ఔషధాల జనరిక్స్ జన ఔషధి దుకాణాల్లో సులువుగా, చవకగా, విరివిగా లభించేలా చూడాలి.

**ప్ర: పారిశ్రామిక ప్రగతి అంటూ బడా పరిశ్రమలకే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నారు. చిన్నపరిశ్రమలు తమ ఉనికిని కోల్పోతున్నాయి? దీనితో ప్రాంతీయ విభేదాలు, తారతమ్యాలు వచ్చే ప్రమాదం ఉంది. పల్లెల్లో నిరుద్యోగ యువతను సరైన మార్గంలో పెట్టేవి చిన్నపరిశ్రమలే. అలాంటి పరిశ్రమలు ఎందుకు అలక్ష్యానికి గురవుతున్నాయి?**

**-కె.మోహిత్, మెదక్**

జ: చిన్న పరిశ్రమల అభివృద్ధికి అవరోధంగా ఉన్న ప్రతికూల పరిస్థితులను తొలగించాల్సిన బాధ్యత ప్రభుత్వం పై ఉంది. కొత్త ఉద్యోగాలను పెద్ద సంఖ్యలో సృష్టించగల సమర్థతను చిన్న పరిశ్రమలకు కల్పించడా నికి ప్రభుత్వం పటిష్ఠ చర్యలు తీసుకోవాలి. చిన్న పరిశ్రమల పునరుద్ధరణకు తమ ప్రభుత్వం అమలుపరు స్తున్న నాలుగు చర్యలు – ప్రభుత్వ సేకరణ విధానం, సూక్ష్మ, చిన్న పరిశ్రమల సంయుక్త అభివృద్ధి కార్యక్రమం, ప్రధానమంత్రి ఉపాధి కల్పన కార్యక్రమం, నైపుణ్యాల అభివృద్ధి ఎంతగానో తోడ్పడతాయి. చిన్న పరిశ్రమలకు సమకూరుస్తున్న పన్ను మినహాయింపు పరిమితిని ప్రస్తుత 1.5 కోట్లనుంచి 10 కోట్ల రూపాయలకు విధిగా పెంచాలి. లేని పక్షంలో అవి అంతరించే ప్రమాదమెంతైనా వున్నది. నిరుద్యోగం పెరిగి సమాజంలో అశాంతి ప్రబలిపో తుంది. సన్నకారు చిన్నకారు రైతులను ఆదుకోని వారు చిన్న పరిశ్రమల శ్రేయస్సుపై శ్రద్ధ చూపుతారా? దేశ తయారీ రంగంలో పెరుగుదల మందగించిన కారణంగానే ఇటువంటి ప్రశ్నలు ఉత్పన్నమవుతున్నాయి. ఈ మాంద్యంవల్ల అధి కంగా నష్టపో తుంది చిన్న పరిశ్రమలేనని మరి చెప్పనక్కర లేదు. సూక్ష్మ, చిన్న పరిశ్రమలకు బ్యాంకులు ఇస్తున్న రుణాల పెరుగుదల రేటు ఈ ఏడాది జనవరిలో 2.3శా తంగా వున్నది. కేవలం 6 నెలల్లోనే ఈ పెరుగుదల రేటు 1.4 శాతానికి పడిపోయింది. నిజానికి ఇదే కాలంలో పారిశ్రామిక రంగానికి బ్యాంకింగ్ రంగం సమకూర్చిన రుణాల మొత్తం గానే తగ్గిపోయాయి. తమకు లభిస్తున్న రుణసదుపాయం మొత్తంగా తగ్గిపోవడం వల్ల చిన్నపరిశ్రమలు సమస్యల పాలయ్యాయి. చిన్నపరిశ్రమలలో ఉత్పత్తి వ్యయం అధి కంగా ఉండడం కద్దు. చిన్న యంత్రాలు, కాలం చెల్లిన సాంకే తికతలు, అనిపుణ కార్మికులు, ముడిపదార్థాలను రిటైలర్ల నుంచి స్వల్ప పరిమాణంలో కొనుగోలు చేయడం, క్రమబద్ధీకరణ నిబంధనలను పాటించడంలో ఆర్థిక ప్రయాసలు మొదలైనవన్నీ అందుకు కారణాలు.

మెయిల్ అడ్రస్
SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

## లెజెండ్



ఏప్రిల్ 15, 1452 లియోనార్డో డావిన్సీ జన్మించాడు. మరణం మే 2, 1519. ఇటలీ కు చెందిన ఒక శాస్త్రజ్ఞుడు, గణితజ్ఞుడు, ఇంజనీర్, చిత్రకారుడు, శిల్పకారుడు, ఆర్కిటెక్ట్, వృక్ష శాస్త్రజ్ఞుడు, సంగీతకారుడు మరియు రచయిత. ఇతడు చిత్రీకరించిన చిత్రాలలో ప్రసిద్ధి చెందినది మొనాలిసా చిత్రం. డావిన్సి తల్లిపేరు రజెస్పాటెరిన్స్. 1469 లో ఈయన తండ్రి ఫ్లోలెన్స్ కు వెళ్లిపోయారు. ఈ కారణంగా డావిన్సీ కొంతకాలం పాటు బాబాయి వరస అయ్యే వ్యక్తి దగ్గర ఉండేవాడు.

# అసమాన ప్రతిభావంతుడు లియోనార్డో డావిన్సీ

14 ఏళ్ళ వయస్సు నాటికే మోడలింగ్‌లో డావిన్సి ఎంతో ప్రతిభ కనబరిచాడు. ఈయనను ఆండ్రియా డెల్ వెర్రాచివో శిల్పాచార్యునివద్ద చేర్పించాడు డావిన్సి తండ్రి.30 యేళ్ళ వరకు డావిన్సి ఫ్లోరెన్స్‌లోనే ఉండి ఎన్నో విషయాలు తెలుసుకోగలిగారు. కానీ అర్జన మాత్రం యేమీ ఉండేది కాదు. 1482 లో డావిన్సీ మిలాన్ రాజుకు తన గురించి తెలియ జెప్పుకున్నాడు. ఫలితంగా ఈయన మిలిటరీ ఇంజనీరింగ్ కాగలిగారు. ఎన్నో రకాల యుద్ధ పరికరాలను రూపొందించారు. రకరకాల ఆయుధాలను తయారు చేసాడు. ఈయన వీధులు, కాలవలు, చర్చిలు,గుర్రపు శాలలు, రాజ ప్రాసాదాలు– ఎలా ఉండాలో చెబుతూ వాటికి ప్లానులు వేసేవాడు. అంతేకాదు 1495లో ప్రపంచ ప్రసిద్ది చెందిన లాస్ట్ సప్పర్ చిత్రాన్ని మొదలుపెట్టి 1497లో పూర్తి చేశాడు.

1499లో డావిన్సీ వెనిస్ నగరం చేరుకున్నాడు. అప్పుడు టర్కీతో యుద్ధం జరుగుతూ ఉండింది. ఆ యుద్ధ సమయంలో ప్రత్యర్థులను కొట్టడానికి కావలసిన సామాగ్రి గురించి, ఆత్మ రక్షణ కోసం ఉపయోగించవలసిన వస్తువుల గురించి, డావిన్సి ఎంతో విశదంగా తెలిపారు. కాని ఆయన ఆలోచనలు చాలా ఖర్చుతో కూడు కున్నవని ఆచరణలో పెట్టలేదు. ఖర్చు విషయం తప్పిస్తే ఈయన చెప్పినవాటికి ఏవీ సాటిరావని చెప్పవచ్చు.

డావిన్సీ 1500లో మళ్ళీ ఫ్లోరెన్స్ చేరుకున్నాడు. 1503లో విశ్వ విఖ్యాతమైన మొనాలిసా పెయింటింగ్ మొదలు పెట్టాడు. ఈ పెయింటింగ్ పూర్తి కావడానికి మూడు సంవత్సరాలు పట్టింది. అంతవరకు ఆ మోడల్ గర్ల్ వస్తూ పోతూ ఉండేది. ఈ పెయింటింగ్‌కు పూర్తి అయ్యాక ఆ చిత్రంలోని అమ్మాయి నవ్వు అతి విచిత్రంగా ఉంది. డావిన్సిని సైతం కట్టి పడేసింది. ఈ నవ్వు మాయాజాలంలా పనిచేసి కోట్లాది మందిని ఆకర్షించగలిగింది. ప్రస్తుతం ఈ పెయింటింగ్. ఫ్రాన్స్‌లోని లౌవ్రె మ్యూజియంలో ఉంది. మోనాలిసాతో సుప్రసిద్ధుడయ్యాక డావిన్సి మిలాన్ చేరుకుని 1506-1513 మధ్య కాలంలో ది వర్జిన్ విత్ చైల్డ్, పెయింట్ అన్నె వర్ల చిత్రాలను లోక ప్రియంగా రూపొందించాడు. 1513లో రోమ్ చేరుకున్నాక ఫ్రాన్సిస్ మహారాజు (మొదటివాడు) ప్రత్యేక అతిధిగా శేష జీవితం గడిపాడు.

ఎగిరే యంత్రాలను గురించి ఆలోచించి డావిన్సీ ఎన్నో రకాల నమూనాలను తయారుచేసాడు. విమానాల వంటివి తయారుచేశాడు.మనిషి శరీరం గురించి పూర్తి వివరాలు తెలియజేశాడు. నీటి గడియారాన్ని అందించాడు. బరువైన వాటిని తేలికగా తొలగించే క్రేన్ లను డావిన్సి ఆకాలంలోనే యేర్పాటు చేశాడు. 1519లో మరణించాడు. కొన్ని సార్లు ఒక ప్రత్యేక వ్యక్తి తను పుట్టిన తరం మొత్తం వివిధ రంగాలలో సాధించవలసిన పురోగతి యొక్క సారాన్ని తాను ఒక్కడే సాధించి ఆ పురోగతికి ఆదర్శంగా నిలుస్తాడు. యూరప్‌లో మధ్య యుగానికి అంతంలో, సాంస్కృతిక పునరుజ్జీవన శకారంభంలో పుట్టిన లియోనార్డో డావిన్సీ నిజంగా ఓ యుగపురుషుడే. జరామరణాలు లేని మోనాలిసాకి ప్రాణం పోసిన అసమాన చిత్రకళాకారుడు. గొప్ప సంగీత విద్వాంసుడు. ఈ అనేక ముఖ ప్రతిభాశాలి కేవలం కళాకారుడు మాత్రమే కాదు. అనుపమాన శాస్త్రవేత్త, ఇంజినీరు కూడా. నాడీ విజ్ఞానంలో, శరీర నిర్మాణ శాస్త్రంలో ఇతడు ఎన్నో అమూల్యమైన విషయాలు కనుక్కున్నాడు. వస్తువుల సాంద్రతని కొలిచే పరికరాలు కనుక్కున్నాడు. ఒక పక్క వెర్రితనం, వట్టి పశుత్వం అంటూ యుద్ధాలని దుయ్యబడుతూనే, దారుణమైన యుద్ధ యంత్రాలని కూడా నిర్మించాడు. లియోనార్డో ఎప్పుడూ విశ్వవిద్యాలయానికి వెళ్లి చదువుకోలేదు. స్వాధ్యాయం, స్వానుభవం – ఇవి రెండే అతడి గురువులు. నా సృజన అంతా శుద్ధ స్వానుభవం నుండి జనించిందే, అదే నా అసలు ప్రేయసి, అని తనే చెప్పుకున్నాడు. ప్రాచీన గ్రీకు, రోమన్ నిపుణులు చెప్పిన ముక్కల్నే వల్లె వేసే తన సమకాలీనులకి భిన్నంగా సొంతగా అధ్యయనాలు చేస్తూ పోయాడు. మెదడులోని కొన్ని భౌతిక చర్యల ఆధారంగా ఇంద్రియాలు బాహ్య ప్రపంచం నుండి వచ్చే సమాచారాన్ని గ్రహిస్తాయని, అర్థం చేసుకుంటాయని నిరూపించడానికి ప్రయత్నించాడు. అంతకు ముందు గాలెన్, వెసేలియస్ మొదలైన వారు ప్రతిపాదించిన కృతక ప్రాణ శక్తుల తో సంబంధం లేకుండా మెదడు క్రియలని పూర్తిగా భౌతిక ధర్మాల సహాయంతో అర్థం చేసుకోజూసిన నాడీశాస్త్ర పురోగామి లియోనార్డో. 1452 లో, ఏప్రిల్ 15 నాడు వించే అనే ఊళ్లో జన్మించాడు లియో నార్డో. ఈ ఊరు ఫ్లోరెన్స్ నగరానికి 20 మైళ్ల దూరంలో ఉంది. ఇరవై నిండని కుర్రవాడిగా ఫ్లోరెన్స్ కి చెందిన ప్రఖ్యాత ఇటాలియన్ శిల్పి, కళాకారుడు అయిన ఆండ్రి యాస్ డెల్ వెర్రోచియో కి చెందిన చిత్రకళా స్టూడియోలో పనికి చేరాడు. ఇరవై ఏళ్ల వయసులో చిత్రకళాకారుల సదస్సులో సభ్యుడయ్యాడు. ఆ దశలోనే లియోనార్డో వేసిన సెయింట్ జెరోమ్ చిత్తరువుని బట్టి అప్పటికే అతడికి మాన వ శరీరంలో కండరాల అమరిక గురించి చాలా క్షుణ్ణంగా తెలిసి ఉండాలని అర్థమవుతుంది. తరువాత 1480 ప్రాంతాల్లో ఫ్లోరెన్స్ నుంచి మిలాన్‌కి వెళ్లాడు. ఆ కాలంలో త్యజించబడ్డ మానవ కళేబరాల మీద పరిచ్ఛేదాలు చేసి శరీర నిర్మాణం గురించి తన జ్ఞానాన్ని పెంపొందించుకున్నాడు. ఆ అధ్యయనాలలో కళని, విజ్ఞానాన్ని అద్భుతంగా సమన్వయపరచుకున్నాడు.

చిత్రకళ కోసం మొదలుపెట్టిన జీవశరీర పరిచ్ఛేదాలు అతణ్ణి నాడీ విజ్ఞానం వైపునకి తీసుకెళ్లాయి. 1487 ప్రాంతాల్లో ఒక సారి కప్ప మీద ఒక ప్రయోగం చేశాడు. ఆ ప్రయోగాన్ని చేసిన మొదటివాడు బహుశ అతడేనేమో. ఆ ప్రయోగం గురించి ఇలా వర్ణిస్తాడు...కప్పలో వెన్నుపాములో మెదుల్లా (మెదుల్లా అబ్లాంగాటా) ని పొడిస్తే కప్ప తక్షణమే చచ్చిపోయింది. అంతకు ముందు కొన్ని ప్రయోగాలలో తల మొత్తం తీసేసినా బతికింది. గుండె, ఇతర అంతరంగ అవయవాలు, పేగులు, చర్మం మొదలైనవి తొలగించినా బతికింది. దీన్ని బట్టి చూస్తే చలనానికి, జీవనానికి మూలం ఇక్కడే ఉందని అర్థమవుతోంది.



శిశువు హాయిగా నిద్రించే ఉయ్యాల, మృతుడు శాశ్వతంగా నిద్రించే సమాధి, ఈ రెంటిపైనా మెరిసే తార మానవుడి ఆశ. -అరవింద యోగి

# 'సీరియల్సు'

బొమ్మ కథలే లేవు!
బాల్య క్రీడలే లేవు!
బంధువుల్తోస్తే కుశల
ప్రశ్నలు వేసే తీరికే లేదు!
పతి సేవలే లేవు!
పిల్లల బాగోగులేం పట్టవు!
బాపురే సీరియల్స్‌లో ఎన్నెన్ని
భాగాలో!?
అర్థమయ్యేలోపు ఈ జీవి
తమే అంతమౌతుందేమో!?
పూర్వజన్మలు, మరుజ
న్మలు... అంటూ...లేని,
పోని భ్రమలు కలిగిస్తూ....
చింతలేని చింతలతో చిరాకు
పడిపోతూ...
విషయం లేకుండా విసుగు
తెప్పిస్తూ...
ఏ ఇంటిలో ఉన్నా
ఆ గంటకి...
ఈ సీరియల్స్ చూడనిదే...
కలవరపడిపోతుంటారు!
సెల్‌ఫోనుల్లోనూ సీరియస్‌గా
సీరియల్ కబుర్లే!
నేరాలు నేర్పిస్తూ...
ఘోరాలు చూపిస్తూ...
కారాలు, మిరియాలు
నూరుతూ...
కాపురాలే కూల్చుతూ...
అర్థం లేని అనుమానాలు
రేకెత్తిస్తూ...
మిడ్‌నైట్ మసాలాలతో
మతులు పోగొడుతూ...
యువతను పెడదోవ
పట్టిస్తూ...
ఫ్యాషన్ ఛానల్స్‌తో
విష సంస్కృతులకు తెర
తీస్తూ...
"పట్టుకో పట్టుచీర"
అని ప్రలోభపెడుతూ...
"కట్టుకో రక్షరేఖ" అని
మాయచేస్తూ...
హింస చూపెడుతూ...
మనఃశ్శాంతిని మట్టుపె
డుతూ...
మంచికి ఎసరుపెట్టి...
చెడును సాగదీస్తూ చూపే
'సీరియల్స్' చూడటం
సిగ్గు! సిగ్గు!!

– కిలిమి యోగేష్,

## రన్నింగ్ వాయిస్

### పజిల్స్ పెంచాలి

ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–హేమంత్, మౌలాలి

### కలర్ పేజీలు

కవర్ పేజీ కథనం సందర్భోచితంగా ఉంటోంది. పబ్లిక్‌ను ఇన్‌వాల్వ్ చేసే శీర్షికలు ఇస్తే బాగుంటుంది. అలాగే పాఠకుల అనుభవాలతో కూడిన ఓ శీర్షిక నిర్వహించండి. యూత్‌ను ఎంకరేజ్ చేసే శీర్షికలు, ఆడవారికి నచ్చే ఐటమ్స్ అన్నీ కవర్ అయితే సండే మరింత జనరంజకంగా ఉంటుంది. అన్నీ కలర్ పేజీలలో ఉండేలా చూడండి.




### వింతలు విశేషాలు

ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి.వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–వెంకట్, గొల్లపూడి

## 'కూని'రాగాలు

నిశ్శబ్దాన్ని వింటున్నా...
నిజమే చెబుతుందా.. తెలియదు..!

నిశీధిలో తిరుగుతున్నా..
నిర్ణయం బాధంతో తెలియదు...!

నిబ్బరంగా ఉండేలా ప్రయత్నిస్తున్నా..
నిటారుగా నిలబడ్డానా.. తెలియదు..!

నాలో నేనే సణుక్కుంటున్నా..
నన్ను నేను మర్చిపోయానా..తెలియదు..!

నాకేదో అయ్యిందని తెలుస్తుంది..
నన్ను నేను కోల్పోయానా.. తెలియదు..!

- కూనిరెడ్డి శ్రీనివాస్

### అమాయకురాలు

గోపమ్మ: ఏమయ్యా! మా అమ్మాయిని అమాయకురాలిని చేసి పెళ్లి కాకుండానే తల్లిని చేస్తావా?
రంగారావు: చాల్లేండి! నాకు మాత్రం పెళ్లైందా ఏమిటి?

### భార్యకావాలి

భక్తుడు: నాకు బాధలనివ్వు, సుఖాలనివ్వు, టెన్షన్ నివ్వు
భగవంతుడు: అగాగు...ఇంత కష్టపడి అడిగే బదులు సూటి గా భార్యని ఇవ్వు ఉంటే సరిపో తుంది కదా!

### అమ్మమాట

పెద్దమనిషి: ఆ ఇంట్లో నలుగరు పిల్లలున్నారు కదా!
పిల్లలు: అవునండి
పెద్దమనిషి: మీలో ఎవరు మీ అమ్మ మాట వింటారు
పిల్లలు: మా నాన్న ఒక్కడే

### ధర్మం...

భిక్షగాడు: ధర్మం చేయండమ్మా
నారాయణమ్మా: పనిమీద ఉన్నాను పోయిరా!
భిక్షగాడు: మీరంత బిజీగా ఉంటే నేనే అక్కడికి వస్తా నమ్మా! పర్సు ఎక్కడుందో చెప్పండి

## ఫన్ చ్
నారు












జ్ఞానం, విజ్ఞానం సంపాదించుకోవాలని అందూ అభిలషించేవారే. అయితే వాటికి మూల్యం చెల్లించడానికి ఇష్టపడేవారెవ్వరూ లేరు. -జువెనల్






**షిండ్లర్స్ ఆర్క్ అనే నవల ఆధారంగా స్టీవెన్ స్పీల్బర్గ్ 1993లో తీసిన చిత్రం ఇది. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో యూదుల పైన జర్మనులు మారణహోమం సాగిస్తున్నపుడు జర్మన్ వ్యాపారవేత్త అయిన ఆస్కార్ షిండ్లర్ వెయ్యిమందికి పైగా యూదులను తన ఫ్యాక్టరీలో ఉద్యోగులుగా నియమించి వారి ప్రాణాలను కాపాడిన యథార్థ సంఘటన ఈ చిత్రానికి మూలం. 2007లో అమెరికన్ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ ఈ చిత్రాన్ని సినీ చరిత్రలో అత్యున్నత 100 చిత్రాలో ఎనిమిదవ చిత్రంగా ఎన్నుకోవడం గమనార్హం.**

# షిండ్లర్స్ లిస్ట్

1939లో చెకోస్లోవేకియాకు చెందిన ఆస్కార్ షిండ్లర్ అనే ధనవంతుడు తక్కువ కూలికి పని చేసే యూదులున్న క్రాకో అనే పట్టణానికి వస్తాడు. అప్పటికే నాజీ సభ్యుడయిన షిండ్లర్ ఆ పట్టణాన్ని తన గుప్పిట ఉంచుకున్న జర్మన్ సైన్యానికి పెద్ద ఎత్తున లంచాలు చెల్లించి యూదులను అతి తక్కువ కూలికి పని చేసే విధంగా తన ఫ్యాక్టరీకి రప్పించుకుంటాడు. జర్మన్ సైన్యానికి అవసరమయిన చిన్న చిన్న పరికరాలు తయారు చేసి లాభాలు గడిస్తూ జర్మ నుల దగ్గర మంచి పేరు తెచ్చుకుంటాడు. అమోన్



గోథ్ అనే క్రూరుడయిన మిలటరీ అధికారి ఆ పట్టణంలో నిర్బంధ కూలీల క్యాంప్ నిర్మించడానికి వచ్చి ఎదురు తిరిగినవారిని నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపించడం కళ్ళారా చూసి షింద్రల్ చలించిపోతాడు. డబ్బుకంటే మనిషి ప్రాణం ఎంతో విలువయినది అని తెలుసుకుంటాడు. కొద్ది రోజు లకు ఆ పట్టణాన్ని వదిలి అక్కడున్న యూదులను 'ఆస్విచ్' అనే ప్రాంతానికి తరలించమని జర్మన్ సైనికులకు ఆదే శాలు అందుతాయి. (ఆస్విచ్ అన్నది అతి పెద్ద జర్మన్ 'కాన్సంట్రేషన్ క్యాంప్. ఈ క్యాంప్‌లో జర్మన్ సైన్యం చేతిలో పది లక్షలకు పైగా యూదులు హింసకు గురై మర ణించారు. )

తన దగ్గర పని చేస్తున్న యూదులు అక్కడికి వెళ్తే మరణిస్తారు అని తెలుసుకున్న షిండ్లర్ వారి ప్రాణాలను కాపా

**Schindler's List**

| | | |
|---|---|---|
| Directed | | |
| Produced by | : | Steven Spielberg |
| | | Branko Lustig, |
| | | Gerald R. Molen, |
| | | Lew Rywin (co-pro ducer) |
| Written by | : | Steven Zaillian (screenplay) |
| | | Based on Schindler's Ark by Thomas Keneally |
| Starring | : | Liam Neeson, |
| | | Ben Kingsley, |
| | | Ralph Fiennes |
| Music by | : | John Williams |
| | | Cinematography |
| | | Janusz Kaminski |
| Editing by | : | Michael Kahn |
| Distributed by | : | Universal Pictures |
| Running time | : | 195 minutes |
| Country | : | United States |
| Language | : | English/ Hebrew German/Polish |

డదానికి అమోన్ గోథ్‌కు తన వద్ద ఉన్న మొత్తం ధనం లంచంగా చెల్లించి దాదాపు 1100 మందిని సురక్షితమయిన మరో ప్రాంతానికి తరలించగలుగుతాడు.

అప్పుడే రష్యా జర్మని సైన్యాన్ని ఓడించడంతో యూరోప్‌లో యుద్ధం ముగుస్తుంది. జర్మన్ అయిన షిండ్లర్ ఆ ప్రాంతం విడిచి వెళ్ళవలసి వస్తుంది. షిండ్లర్‌కు వీడ్కోలు చెప్పడానికి కార్మికులు వచ్చి తమ ప్రాణాలు కాపాడిన గొప్పవాడిగా కీర్తిస్తూ ఉంగ రం ఇస్తారు. తన దగ్గర ఇంకా డబ్బు ఉంటే మరి కొందరి ప్రాణాలు కాపాడ గలిగేవాడినని బాధపడుతూ షిండ్లర్ తన కారులో భార్యతో కలసి వెళ్ళిపోతాడు.

**నిర్మాణ విశేషాలు**

షిండ్లర్ పాత్ర పోషించడానికి కెవిన్ కాస్ట్నర్, మెల్ గిబ్సన్ వంటి నటులు ఆసక్తి చూపినా లియం నీసన్‌ను ఎన్నుకున్నాడు స్టీవెన్ స్పీల్బర్గ్. దాదాపు 30,000 మంది ఎక్స్ట్రా నటులు కావలసి వచ్చింది. షూటింగ్ పోలండ్ లోని క్రాకో వద్ద మార్చి 1 1993 న మొదలయి 71 రోజుల్లో ముగిసింది. యదార్థ సంఘట నలు జరిగిన ప్రదేశంలోనే దాదాపు మొత్తం షూటింగ్ జరి గింది. చిత్రానికి దర్శకత్వం చేస్తున్నపుడు స్పీల్బర్గ్ మానసికంగా ఎంతో క్షోభ పడ్డాడు. ముఖ్యముగా యూదులను నగ్నంగా పరిగెత్తించే దృశ్యం అందరినీ తీవ్రంగా కలచివేసింది. 40 శాతంకు పైగా చేతితో కెమెరాలు పట్టుకొని తీసిన ఈ చిత్రం బ్లాక్ అండ్ వైట్‌లో చిత్రీకరింబడింది.

**స్పందన:**విడుదలయిన తర్వాత ఈ చిత్రం ఘన విజయం సాధించింది. ప్రపంచ వ్యా ప్తంగా 321.2 మిలియన్ల కలెక్షన్లు సాధించింది. మొత్తం ఏడు ఆస్కార్ అవార్డులు గెలుచుకొంది. 20 08 నాటికి ఇంటర్నెట్ మూవీ డేటాబే సులో అత్యుత్తమ చిత్రాలలో ఏడవ స్థానంలో ఉంది. ఈ చిత్రం అమెరికన్ ఫిల్మ్ ఇన్స్టి ట్యూట్ 10 టాప్ 10 చిత్రాలు జాబి తాలో ఎపిక్స్ విభాగంలో మూడవ స్థానంలో నిలిచింది. సినిమా అంతా బ్లాక్ అండ్ వైట్. కానీ కొన్ని సన్ని వేశాలలో ఒక పాప డ్రెస్‌ని మాత్రం ఎరుపులో చూపిస్తారు. ఎందుకో అర్థం కాలేదు. ఈ పాప బ్రతుకుందేమో అను కుంటారు అంతా....అలా చిన్న ఆశ కలుగుతుంది. చివరికి ఆ ఆశ కూడా నిరాశే అని తేలుతుంది. అక్కడున్న జూస్ బతుకుతామని ఆశ పడడం వృథా అని నొక్కి చెబుతుంది.

ఇక గుండెలు పిండేసే క్లైమాక్స్. కిందామీదా నానా తంటాలు పడి, అతి కష్టం మీద తనకున్నదంతా వెచ్చించి పద కొండు వందల యాభై మంది జూస్‌ని కాపాడతాడు షిండ్లర్. వారికి ఏడు నెలలు పాటు తల దాచుకోడానికి చోటివ్వడానికే తన పుట్టినూరులో ఫ్యాక్టరీని పెడతాడు. చివరికి రెండవ ప్రపంచ యుద్ధం ముగిసి, సోవియట్ రష్యా చేతిలో నాజీలు ఓడిపోతారు. అప్పుడు ఈ జూస్ (షిండ్లర్ కాపాడిన జూస్)కి విముక్తి కలుగుతుంది. నాజీ పార్టీ వారిని అరెస్ట్‌చేస్తారు. ఇతను నాజీ పార్టీ వాడవ్వడం వల్ల దేశం వదిలి వెళ్ళే షిండ్లర్‌ని జూస్ అందరూ సాగానంపవస్తారు. వాళ్ళని చూసి నేను ఇంకా కొంత మందిని కాపాడుండ వలసింది. కపాడగాలిగీ కాపడలేదు. బోలెడు డబ్బు




వృథా చేసాను. ఈ కార్ ఎందుకు – ఇది ఒక ఇంకో పడి మందిని కాపాడేదేమో, ఈ బంగారవు బ్యాడ్జ ఎందుకు ఇది ఇంకో ఒక్కరినైనా కాపాడేదేమో అని చాలా బాధపడతాడు. అక్కడ అప్రయత్నంగా గుండె కరిగి గొంతులోకి వచ్చేస్తుంది ప్రేక్షకులకి...

ఈ మారణహోమం విన్న ఎవరికయినా గుండె రగిలిపోతుంది. అందులో స్పీల్బర్గ్ దర్శకుడు, అందునా జూ.ఇంకెంత రగిలిపోయి ఉంటాడు, ఎంత వేదన చెంది ఉంటాడు. ఆ బాధ ప్రతీ ప్రేక్షకుడికి గుండెలో పలికించ గలగడం, ప్రతీ మనిషిని ఒక ఘడియ ఆపి ఆలోచింప చెయ్యడం, ఒక కన్నీటి బొట్టు నివాళిగా రాల్చ గలిగేలా చెయ్యడం లో స్పీల్బర్గ్ కృతకృత్యుడు అయ్యాడు. ఈ సినిమాకి స్పీల్బర్గ్ ఒక్క డాలర్ రెమ్యూనరేషన్ కూడా తీసుకోలేదు. సినిమా అంతా నాజీల అరాచకం గురించి అయినా, ఎక్కడా హిట్లర్ కనపడడు, అతని గొంతు వినపడదు. ఆమధ్య జరిగిన హోటల్ రవాండా కూడా ఇలాటి మారణహోమాన్నే తలపిస్తుంది. అందులో ఒక సామాన్యుడు పరిస్థితులని బట్టి, కొన్ని వందల మంది జనాల పాలిట రియల్ హీరోగా ఎలా పరిణితి చెందుతాడో చూపెడుతుంది. దారుణ మరణ హోమాన్ని కళ్ళకు కట్టినట్టు చూపెడుతూనే, ఆ ప్రతికూల పరిస్థితులలో పోరాడే మానవత్వాన్ని, ఆశావాదాన్ని చాటుతుంది.







అలవాటు అనేదాన్ని అరికట్టకపోతే, అది త్వరలోనే ఒక అవసరంగా మారిపోతుంది.-సెయింట్ ఆగస్టన్





సినీ సాహిత్యానికి జానపద సొబ గులు అద్ది, తనకంటూ ఓకొత్త ఒరవడిని సృష్టించుకున్న కొసరాజు. చిన్ననాటినుండే తెలుగు సాహిత్యము, పురాణాలు, కావ్యాలపై పట్టు సాధించి, వరుసకు పెదనాన్న త్రిపురనేని రామస్వామి నుండి అచ్చ తెలుగు నుడికారము, తర్కవితర్కాలు, తెలుగు భాషా సౌందర్యము తెలుసుకున్నాడు. తెలుగు పండితుడు ముదికొండ నరసింహం పంతులు సాంగత్యముతో తన భాషా పటిమకు మెరుగులు బెట్టాడు. అదే సమయములో రైతుబిడ్డగా పొలము పనులలో నిమగ్నమై జానపదుల తెలుగులోని సొగసులు, చమక్కులు తెలుసుకున్నాడు. తెలుగు సినిమా గీతాలపై తనదైన ముద్రను వేశాడు కొసరాజు రాఘవయ్య చౌదరి.

# జనగీతాల రారాజు




జానపద గీతాల్లోని లాలిత్యాన్ని, ఆ పొగరూ వగరూ ఏమాత్రం తగ్గకుండా తెలుగు సినిమాకు అమర్చిపెట్టింది కొసరాజు రాఘవయ్య చౌదరి. ఏరువాక సాగాలోరన్నో అంటూ సేద్యగాళ్ళకు ఉత్సాహం రేకెత్తేలా ధైర్యం చెప్పినా రామయ తండ్రి ఓ రామయ తండ్రి మానోములన్ని పండినాయి రామయ తండ్రీ అని గుహుడి చేత శ్రీరాముడ్ని ఏరు దాటించినా ఆయా పాటల్లో ఆద్యంతం కొసరాజు ముద్ర ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

కొసరాజుగా ప్రసిద్ది చెందిన ఈ తెలుగు సినిమా పాటల రచయిత పూర్తి పేరు కొసరాజు రాఘవయ్య చౌదరి. తెలుగు సినిమా పాటల రచయితగా కొసరాజుది ప్రత్యేక పీఠం. ఆ రోజుల్లోని చాలా చిత్రాలు కొసరాజు ముద్రని బాగా వాడుకున్నాయి. వ్యంగ్యం, హాస్యం మేళవించిన పాట ఒకటి చిత్రంలో వుండాలి, అది రాఘవయ్య చౌదరి గారు మాత్రమే రాయాలి - అని అప్పట్లో సినిమా జనాలకు ఒక సూత్రం ఉండేది. ఆ సూత్రానికి తగ్గట్టుగానే కొసరాజు వందలాది గీతాసుమాల్ని గుచ్చి ప్రకాశ పరిమళభరితం చేశారు. జానపదగీతాల్లోని లాలిత్యాన్ని, ఆ పొగరూ వగరూ ఏమాత్రం తగ్గకుండా తెలుగు సినిమాకు అమర్చిపెట్టింది కొసరాజు రాఘవయ్య చౌదరి. ఏరువాక సాగాలో రన్నో అంటూ సేద్యగాళ్ళకు ఉత్సాహం రేకెత్తేలా ధైర్యం చెప్పినా రామయతండ్రి ఓ రామయతండ్రి మానోములన్ని పండినాయి రామయ తండ్రీ అని గుహుడి చేత శ్రీరాముడ్ని ఏరు దాటించినా ఆయాపాటల్లో ఆద్యంతం కొసరాజు ముద్ర ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. పనిగట్టుకుని హాస్యాన్ని పాటల్లోకి ప్రవేశపెట్టినవాడు కొసరాజురాఘవయ్య చౌదరి. అంతే కాకుండా ఆయన హాస్యాన్ని సాంఘిక విమర్శకు కూడా బాగా వాడుకున్నాడు. 1953 నుంచీ 1986 అక్టోబరు 27 వరకూ ఆయన మూడు వేలకు పైగా పాటలు రాశారు.




"పేరు కొసరాజు, తెలుగంటే పెద్దమోజు" అని స్వయంగా ప్రకటించుకున్న జానపద గీతాల రారాజు గురించి ఎంతరాసినా తక్కువే. తెలుగు పదం, తెలుగు పద్యం, తెలుగు తనం మూర్తీభవించిన మహోన్నత వ్యక్తిత్వం ఆయనది. జేబులో బొమ్మ, కళ్ళు తెరచికనరా, ఏరువాకాసాగారో, జయమ్ము నిశ్చయమ్మురా, వినరావినరానరుడా..., సరిగంచు చీరగట్టి... శివగోవింద గోవింద, డబ్బులోనె ఉందిరా, నందామయా గురుడ, శివశివమూర్తివి, తింటానిక్కూడుచాలదే,




పల్లెటూరు మన భాగ్యసీమరా, చెంగుచెంగునా గంతులు వేయండి, సరదా సరదా సిగిరెట్టు, ఆడుతుపాడుతూ పనిజేస్తుంటే, ముక్కుచూడు ముక్కందం చూడు... ఇలా మూడున్నర దశాబ్దాల కాలంలో మూడువేలకు పైగా గీతాలు రాసి 'కవిరత్న'గా, 'జానపద కవి సార్వభౌముడు'గా పండిత పామరుల మన్ననలు పొందినవారు కొసరాజు రాఘవయ్య చౌదరి. కేవలం హాస్యప్రధానమైన పాటలే గాకుండా, విభిన్నమైన అం

రుడా..., సరిగంచు చీరగట్టి... శివగోవింద గోవింద, డబ్బులోనె ఉందిరా, నందా మయా గురుడ, శివశివమూర్తివి, తింటాని క్కూడు చాలదే, పల్లెటూరు మన భాగ్య సీమరా, చెంగుచెంగునా గంతులు వేయండి, సరదా సరదా సిగిరెట్టు, ఆడుతు పాడుతూ పనిజే స్తుంటే, ముక్కుచూడు ముక్కందం చూడు... ఇలా మూడున్నర దశాబ్దాల కాలంలో మొత్తము 200 చిత్రాలకు 1000 పాటలు వ్రాశారు. సామె

రాశారు. బుర్రకథలు రాయడంలో ఆయన దిట్ట. ఎన్నికలకు, సినిమాలకు ఎన్నో రాశారు. తెలుగు సాహిత్యంలో వివిధ సాహిత్య ప్రక్రియలు చేపట్టి తన ప్రతిభేమిటో నిరూపించారు కొసరాజు. ఆయన తెలుగునాడు వినిపించే పలుకుబడులకు, సామెతలకు, నుడికారాలకు కావ్య గౌరవం కల్పించారు.

శాలపై మంచి పాటలు రాశారు కొసరాజు. "మంచి మనసులు" సినిమాకోసం "మావా మావా మావా!ఏమే భామా భామా"అంటూ రాసిన పాట, సంగీతం సమకూర్చిన మహాదేవన్ గారిని స్వరాల మామను చేసింది. ప్రేక్షకుల నీరాజనాలను అందుకుంది. మగవాళ్ళు, ఆడవాళ్ళు పరస్పరం కవ్వించుకునే గీతం"వాలు వాలు చూపుల్తో గాలమేసి లాగి లాగి ప్రేమలోకి దించుతారు మీరుగాదా" అనేవి, ఆ తర్వాత తెలుగునాట ప్రేమోక్తలయ్యాయి. ఘంటసాల, జమునారాణి పాడిన ఈ పాట వారికి కూడా మంచిపేరు తెచ్చిపెట్టింది. "దులపర బుల్లోడా! దుమ్ము దులపర బుల్లోడా" పాట భానుమతిగారి నోట రసవంతంగా వినిపించేలా రాశారు. మూగజీవుల పట్ల కారుణ్యభావాల్ని ప్రక టిస్తూ "వినరా వినరా నరుడా; తెలుసుకోర పామరుడా;" అనే పాటను గోమాత స్వగతంగా రాశారు." చెంగుచెంగున గం తులు వేయండి" పాటకూడా ఈ భావంతో సాగేదే. రాఘవయ్య తొలుత కథానాయకునిగా రైతుబిడ్డ (1939) అనే చిత్రములో నటించాడు. కవిగా రాఘవయ్య ప్రతిభ గుర్తించిన బి. ఎ. సుబ్బారావు, కె. వి. రెడ్డి వారి చిత్రాలకు పాటలు వ్రాయించారు. 1954లో విడుదలైన 'పెద్ద మనుషులు' చిత్రానికి రాఘవయ్య వ్రాసిన పాటలు ఆంధ్రదేశ ప్రేక్షకులను ఉర్రూతలూగించాయి. సుబ్బారావుగారి'రాజు పేద' చిత్రములోని 'జేబులో బొమ్మ జే జేలబొమ్మ' బహుళ ప్రాచుర్యం చెందింది. రోజులు మారాయి (వహీదా రెహ్మాన్ నాట్యముతో)లో 'ఏరువాక సాగారో', 'ఇల్లరికములో ఉన్న మజా' , 'అయయో జేబులో డబ్బులు పోయెనే', 'ముద్ద బంతి పూలు బెట్టి' మొదలగు పాటలు కోట్లాది తెలుగు ప్రేక్షకుల మనసులలో చిరస్మరణీయముగా మిగిలిపోయాయి. అచ్చతెలుగులోని అందాలు, జానపదుల భాషలోని సొగసులు, పల్లెపట్టున ఉండే వారి భాషలోని చమత్కారాలు, విరుపులు రాఘవయ్య పాటలలో జాలువారతాయి. జేబులో బొమ్మ, కళ్ళు తెరచికనరా, ఏరువాకాసాగారో, జయమ్మునిశ్చయమ్మురా, వినరావినరాన

తలు, పలుకుబళ్ళు, తెలుగు నుడికారంతో గేయ సాహిత్యానికి వన్నె తెచ్చిన కొసరాజు 1984లో రఘుపతి వెం కయ్య అవార్డును, 1985లో కళాప్ర పూర్ణ బిరుదును పొందారు.. చివరిసారిగా సురేష్ ప్రొడక్షన్ వారి "గురుబ్రహ్మ" చిత్రానికి 19 86 అక్టోబర్ 27వ తేదీన "వినరా, ఆంధ్రకు మారా" అనే బుర్రకథను రాసి, అదేరోజు రాత్రి పది గంటలకు పరమ పదించారు. ఆయన హేతువాది. ఏరు వాక... ఏటినీరు ఉండేంత వరకు కొసరాజే రసరాజు.

కొసరాజు సినిమా గీతాలు మినహా మరేమీ రాయలేదనుకుంటే పొరబడినట్లే. ఆయన సినిమా పాటలు, అద్భుతమైన ఆయన కావ్యాలను మింగేశాయి. కొసరాజు జాతీయోద్యమం, ఆంధ్రోద్యమం ప్రేరణతో రాసిన కావ్యాలు - "గండికోట యుద్ధం", "కొండవీటి వైభవం". ఈ రెండు కావ్యాల్లోనూ పద్యాలు తేలికైన పదాలతో మధురంగా సాగుతాయి. సినీ రచయిత మోదుకూరి జాన్సన్ మాటల్లో చెప్పాలంటే "కొసరాజులో గురజాడ, గిడుగుల భాషావిప్లవ ముంది. కవిరాజు త్రిపురనేని భావవిప్లవవు వేడి ఉంది. నవయుగ చక్రవర్తి గుర్రం జాషువా కన్నీటితడి ఉంది. అప్పటి స్వాతంత్ర్య సమరోత్సాహాల, ప్రజాభ్యుదయాల ప్రభావం ఉంది. కనుకనే ఆయన భావాలు ప్రజాహితాలు, ఆయన భాష పల్లెసీమ హృా ఎదయనాదం".

కొసరాజు స్వతంత్ర శతకాలు కూడా రాశారు. "శంభుకర్షిప్రభుశతకం, మిత్రనీతి, వీరశేఖర శతకం, భానుగీత, సినిమాడైరెక్టరు, కొసరాజు విసుర్లు-" ఇవన్నీ ఆయన కలం నుంచి వెలువడిన శతకాలే. అలాగే- బంగారువాన, కడగండ్లు, చిట్టిచెల్లి, రాష్ట్ర గీతికలు, కాకర్ల గోపాలనాయుని వంశ చరిత్ర, నవభారతం వంటి ఎన్నో లఘురచనలు చేశారు. పల్నాటి ప్రతిభ, శివాజి, ఫాసిస్టుగీతాలు, దేవునిమొర, సుస్వాగతము, కుప్పుస్వామి చౌదరి, ఆనందబాష్పాలు... వంటి ఎన్నో లఘు రచనలు ఇంకా అముద్రితాలుగా ఉన్నాయి. వీటన్నిటితోపాటు ఆయన తన స్వీయచరిత్ర కూడా

ఆయన భాష సరళం. భావం సుకుమారం, పద్యకావ్యాలైనా, సినిమా గేయాలైనా, మళ్ళీ మళ్ళీ చదవాలని, వినాలని కోరుకునేలా రాశారు కొసరాజు.

ఆయన పొందిన సత్కారాలు అనేకం. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ నిర్వహించిన బుర్రకథల పోటీలో "నవభారతం" బుర్రకథకు ఆయన ప్రథమ బహుమతి పొందారు. అఖిలభారత కాంగ్రెస్, ఫిలించాంబర్ ఆఫ్ కామర్స్, రాజ్యలక్ష్మి వెంకన్న చౌదరి ఫౌండేషన్ వంటి సంస్థలు ఆయన్ని ఘనంగా సత్కరించాయి. తెనాలి క్లాసికల్ ఫిలిమ్ సొసైటీ నుంచి సముద్రాల రాఘవాచారి అవార్డు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే రఘుపతి వెంకయ్య అవార్డు, ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి కళాప్రపూర్ణ అందుకున్నారు. వ్రాసిన మాటలే వ్రాయుట కంటె, పాడిన పాటలే పాడుట కంటె, సరి కొత్త రచనల సాగించినపుడె, కవి చమత్కా రాన కథ రక్తికట్టు"- అంటూ నవ్యతకోసం పరితపిం చిన కొసరాజు తెలుగుభాష ఎంత కమ్మగా, కమనీయంగా ఉంటుందో తన రచనల్లో చూపారు. "జాను దేశి కవిత నానుడికా రమ్ము, ఏ నిఘంటువులకు నెక్కకుండు, చిన్ననాటి నుండి జీర్ణించుకొన్నాను, పల్లెపదములన్న పరమ ప్రీతి"- అన్నట్లుగానే ఆయన రచనల్లో వందల సామెతలు, జాతీయాలు, పలుకుబడులు కనిపిస్తాయి.

ఇక సినిమా పాటల్లో ప్రబోధగీతాలు, సామ్యవాద గీతాలు, లోకంపోకడ తెలిపేవి, భవిష్యత్తును తెలిపేవి, పల్లెపదాలు, వ్యవసాయానికి, రైతులకు సంబంధించినవి, హాస్యగీతాలు... ఎన్నో రాశారు. జానపదగీతాల్లోని పల్లవులను, పలుకుబడులను బాణీలను, పొడుపుకథలను ఉపయోగించి తెలుగు సినిమా పాటలను ఆయన సారవంతం చేశారు. యక్షగానాలు, వీధిభాగవతాలు, హరికథలు, జముకుల కథలు, బుర్రకథలు, భజనగీతాలు, పగటివేషగాళ్ళ పాటలు, రజకుల పాటలు, పాములోళ్ళపాటలు, గంగిరెద్దుల గీతాలు ఎన్నో రాశారు.ఆయన తెలుగువాడిగా పుట్టినందుకు అనేక సందర్భాల్లో ఎంతో గర్వించారు.

## తెలుసుకోండి'లా'

# మనోవర్తి ఎలా వస్తుంది



ప్ర: 2015 సంవత్సంలో పెద్దల సమక్షంలో మా బంధు వైన ఒక వ్యక్తితో నా వివాహము జరిగినది. 6 నెలల తరువాత మా ఇద్దరిమధ్య కొంత భేదాభ్రిప్రాయం రావడంతో నన్ను మా పుట్టింటికి పంపించాడు. తరువాత అతను ఎక్కడో వేరే పెళ్లి చేసుకున్నాడని తెలిసింది. నాకు నా భర్త చేసిన మోసాన్ని వివరిస్తూ ఒక న్యాయవాది ద్వారా గృహ హింస చట్టం క్రింద 2016లో వేసిన కేసులో ఇంతవరకు నాకు ఎలాంటి మనోవర్తిగాని, ఉండడానికి నివాసము గాని లభించలేదు. దీనితో నేను కృంగిపోయి ప్రతివారిని సలహ అడుగుతున్నాను. ఇప్పటివరకు నలుగురు న్యాయవాదులను సంప్రదించాను. ప్రతీచోటా అందరికీ అడిగినంత డబ్బులు ఇచ్చుకుంటూ వస్తున్నాను. ఇదేమిటి అని అడుగగా నీయొక్క ఈ.గ.ఇ లో నివాసము అడుగలేదు అని కొంత, తాత్కాలిక మనోవర్తి అడగలేదు అని, నీకు ఏమి రావు అని కొంత... ఇలా రకరకాలుగా చెప్పుచున్నారు. అయితే మా అత్తమామల సొంత ఇల్లు ఉంది. ఆ ఇంట్లో నివాసం ఉండడానికి నేను ఎలాంటి చర్య తీసుకోవచ్చు? ఈ విషయంలో నా పరిధులేమిటి? వివరించండి.

–నళిని, రాజమండ్రి

జ: మీ పెళ్ళి పెద్దల ద్వారా జరిగినదా లేదా ప్రేమపెళ్ళి చేసుకున్నారా అన్నది ముఖ్యం కాదు. పెళ్ళి జరిగినదా లేదా అనేదే ముఖ్యం. దీనికి గల అధారాలు, సాక్ష్యాలు ఉన్నాయా? లేవా? అన్నది మాత్రమే ముఖ్యం. గృహహింస చట్టం రాకముందే విడిపోనప్పటికీ ఈ చట్టం కింద భరణం పొందే అధికారం ఉందని కోర్టు పేర్కొంది. ఢిల్లీకి చెందిన ఒక జంటకు సంబంధించిన వైవాహిక కేసును పరిష్కరిస్తు జస్టిస్ అల్తావాస్ కబీర్, జస్టిస్ జె.చలమేశ్వర్‌లతో కూడిన ధర్మాసనం ఈ మేరకు

**ఢిల్లీకి చెందిన ఒక జంటకు సంబంధించిన వైవాహిక కేసును పరిష్కరిస్తు జస్టిస్ అల్తావాస్ కబీర్, జస్టిస్ జె.చలమేశ్వర్‌లతో కూడిన ధర్మాసనం ఈ మేరకు రూలింగ్ ఇచ్చింది. అదే విధముగా భర్త నుంచి విడిపోయిన భార్యకు భర్త ఇంట్లో ఉండే హక్కు ఉందని సుప్రీంకోర్టు స్పష్టం చేసింది.**



రూలింగ్ ఇచ్చింది. అదే విధముగా భర్త నుంచి విడిపోయిన భార్యకు భర్త ఇంట్లో ఉండే హక్కు ఉందని సుప్రీంకోర్టు స్పష్టం చేసింది. అదే విధముగా భార్యకు దీని కింద రక్షణ లభిస్తుంది. ఈ మేరకు ఢీల్లి హైకోర్టు వాదన సబబే అని పేర్కొంది.

అదే విధముగా భార్యకు తన నివాసంలోని గణనీయ భాగాన్ని కేటాయించల్సిన బాధ్యత భర్తపై ఉంటుందని వివరించింది. వి.డి. భానోత్ భార్య సవితా 2006 నవంబర్ 29న గృహహింస నిరోధక చట్టంలోని సెక్షన్ 12 కింద మేజిస్ట్రేట్ ఎదుట ఒక పిటీషన్ దాఖలు చేశారు. దీంతో భావోత్ నివాసంలోని మొద టి అంతస్తులో ఉండేందుకు వీలు కల్పిం చాలని మేజిస్ట్రేట్ అదేశించారు.

దాని ఆధారముగానైనా సరే పెండింగ్‌లో వున్న డి.వి.సి అనగా గృహహింస నిరోధక చట్టం గల కేసులో తాత్కాలికమైన పిటీషన్స్ మూడు. ఒకటి ఇబ్బటజీర్భ్భజ్జీచ్చి. రెండవది పోలీసు రక్షణ. మూడవది మీ యొక్క అత్తమామల ఆస్తి అనగా ఇంట్లో ఉండటానికి వసతి అని మూడు పిటిషన్స్ వేసి న్యాయస్థానమునకు నమ్మదగు విధముగా చెప్పి కోర్టు ద్వారా ఆర్డర్స్ తీసుకొని వెళ్ళగలరు. అలాంటి అర్డర్స్ లేకుండా చట్ట విరుద్ధమైన పనులు చేయరాదు. కావున మీరు నేను చెప్పినట్టు 3 పిటిషన్స్ ద్వారా అర్డర్స్ తీసుకొని నచో మీ భర్త ఎక్కడ వున్నా, తప్పక న్యాయము జరుగును. అదేవిధముగా మీ భర్త రెండవ పెళ్ళి చేసుకొనినట్లు అధారాలు ఉంటే మాత్రమే కేసు పెట్టగలరు. అధారాలు లేకుండా కేసు పెట్టవద్దు.

ప్ర: 2006లో ఒక వ్యక్తి తో వివాహేతర సంబంధం ద్వారా ఒక బాబుకు తల్లినయినాను. అతను నన్ను పెండ్లి చేసుకుంటానని చెప్పి మోసం చేసినాడు. అతనికి అంతకు ముందు హైదరాబాద్‌లోని ఒక అమ్మాయితో పెద్దల సమక్షములో పెండ్లి అయినట్లు, అతనికి ముగ్గురు కొడుకులు కూడా ఉన్నారని తెలసినది. నేను మోసపోయానని గమనించిన వెంటనే... మా దగ్గరలోని పోలీసు స్టేషన్‌లో ఫిర్యాదు చేసినాను. కానీ, ప్రయోజనం లేకపోయినది. దీనికి కారణం అతనికి డబ్బు, రాజకీయం అండగా ఉన్నాయి. ప్రస్తుతం నా పిల్లవాన్ని పోషించడం చాలా కష్టంగా ఉన్నది. ఇక్కడ పెద్దలు కూడా నాకు ఎలాంటి న్యాయం చేయడం లేదు, అదేమి అనగా నీవు వివాహేతర సంబంధం ద్వారా పిల్లవాన్ని కనడం నేరం. అతనికి ముందుగా పెళ్ళి అయినట్లు విచారణ చేయకుండా ఎలా ఈ పని చేసినావు అని నన్నే తిట్టుచున్నారు. దీనికి న్యాయ పరిష్కారం చెప్పగలరు.

– రేవతి, నల్లగొండ జిల్లా

జ: ఇలా చాలామంది మోసపోవడం తరువాత బాధపడడం, అనేక రకములుగా జరుగుచున్నవి. దీనికి కారణం అమ్మాయి తొందరప డటం, అదే విధంగా ఇలా మోసగాళ్ళకు బుద్ధి చెప్పలేకపోవడం. అలాగే మన చట్టాలు మన కు సహకరించకపోవడం. ఇలా అనేక రకములుగా అడవాళ్ళు మోసపోవడం జరుగుచున్న ది. అయిన మీరు అధైర్యపడకుండా ధైర్యంగా మీదగ్గరలోని జిల్లా శిశు సంక్షేమ శాఖ ఏజెన్సీ ద్వారాగాని లేక నేరుగా మీ దగ్గరలో కోర్టులో ని ఉచిత న్యాయసేవా కేంద్రములో గాని సం ప్రదించి మోసపూరితమైన కేసు (క్రిమినల్) పెట్టచూ సెక్షన్ 125 క్రిమినల్ ప్రొసీడింగ్ రూల్స్‌లోని సబ్‌సెక్షన్ (బి) క్రింద వివాహామై నా, కాకున్నా... స్వయం పోషణ చేసుకో లేని, మైన రుగా ఉన్న తన సక్రమ లేక అక్రమ బిడ్డకు, అక్రమ సంబంధ మైన... అనగా తల్లికి బిడ్డకు నెల పోషణ, రక్షణ, నివాసం కోసం భరణ పోషణ అనగా నెలసరి రేటు చొప్పున మెజి స్ట్రేటు ఉత్తరువు నీయవచ్చు.

## లక్కీ నంబర్

# ఏ పనీ సవ్యంగా సాగడం లేదు

నా పేరు ఎమ్. మహేష్. డేట్ ఆఫ్ బర్త్ 8-5-1988. చదువులో ఏకాగ్రతలేదు. చదువుసాగడంలేదు. ఏదీ కూడా కలిసిరావడంలేదు. నాకు సరైన మార్గం చూపించండి.

**మహేష్, హైదరాబాద్**

మహేష్ అనే పేరులో 6, 3 అనే సంఖ్యలు ఉన్నాయి. అందువలన జీవితం ఆరు మూడు అవుతున్నది. అంటే రెండూ కూడా విధ్వంసం నంబర్లే. మీ పేరులో మహేష్‌కు ముందు ఎమ్ అనే ఇనిషియల్‌ను చేరిస్తే 31వ నంబర్ వస్తుంది. దీనిని డెత్ నంబర్ అని అంటారు. అందుకని మీరు మీ పేరును ఇక నుండి **MAAHESH** గా మార్చుకుని వాడుకోండి. ఈ పేరులో అత్యంత ప్రభావం గల 24 నంబర్ చేర్చడం జరిగింది. దీనికి జతగా ఇంటిపేరులోని ఇనీషియల్ ఎమ్ కూడా పేరుకుముందు వాడుకోవచ్చు. దాని వలన 28వ నంబర్ వస్తుంది. 6,7 మీ అదృష్ట సంఖ్యలు. ఇలా మార్చుకుంటే మీరు కోరుకున్న విజయాలు మీ తలుపు తడతాయి. ఉన్నత విద్యావంతులు కాగలరు.

★★★

నా పేరు మోకిలి రాజు. పుట్టిన తేదీ 8-1-1975. నేను ఎంతగా కష్టపడినా సరైన ఫలితం ఉండటంలేదు. నా మానసిక ఆరోగ్యం సరిగాలేదు. అన్నీ సమస్యలే. నాకు దయచేసి ఏదైనా మార్గం చూపించగలరు.

**మోకిలి రాజు హుజూరాబాద్**

మోకిలి రాజు అనే పేరులో బ్లాస్టింగ్ నంబర్ ఉంది. అది వ్యతిరేక ప్రభావం చూపే సంఖ్య. సంఖ్యాశాస్త్రం ప్రకారం దాని ఫలితం చాలా తీవ్రంగా ఉంటుంది. మీరు మీ ం పేరును **MOKILLE RAZU** గా 41 రోజులు 41 సార్లు 5 కోర్సులుగా రాసుకోండి. 2,5 మీ అదృష్ట సంఖ్యలు. ఇకనుండి మీరు ఎక్కడ రాసినా ఇలానే రాసుకోండి. మీ జీవితం అంతా అదృష్టదాయకంగా సాగుతుంది. మీ మానసిక అనారోగ్యం కూడా కుదటపడుతుంది. ఆర్థికంగా నిలదొక్కుకుంటారు.

★★★

నా పుట్టిన తేదీ 4-3-1975. నా పేరు సతీష్. చేస్తున్న ఉద్యోగంలో ఎదుగుదల లేదు. అన్నీ కూడా రివర్స్‌గా జరుగుతున్నాయి. అనుకున్నది ఒకటి అయింది మరొకటి అన్నట్టుగా ఉంది. ఏ పనీ కూడా సవ్యంగా సాగడంలేదు. అన్నీ సమస్యల మయం. సరైన మార్గం చూపించండి.

**సతీష్, నిజామాబాద్**

సతీష్ అనే మీ పేరులో రివర్స్ నంబర్ 12 ఉంది. అందువలనే మీకు అలా జరుగుతోంది. ఇక నుండి మీ పేరును **SATTISH** అని 21 సార్లు 10 కోర్సులుగా రాసుకోండి. 3,7 మీ లక్కీనంబర్లు. ఇలాచేస్తే మీ జీవితం అంతా సుఖమయంగా సాగుతుంది. మీరు అనుకున్న పనులు...మీ ధ్యేయం నెరవేరుతాయి. కష్టాలన్నీ కడతేరుతాయి. జీవితంలో రెండవ అధ్యాయాన్ని చవిచూస్తారు.

★★★

నేను మహబూబ్‌నగర్‌లో స్టేట్ గవర్నమెంట్ ఉద్యోగిగా చేస్తున్నాను. నా పేరు సి సాంబమూర్తి. డేట్ ఆఫ్ బర్త్ 6-4-1953. చిన్నప్పటి నుండి నాకు ఆర్థిక ఇబ్బందులే. సంతానం కూడా లేదు. చేస్తున్న ఉద్యోగంలో ప్రమోషన్ లాంటివి కూడా లేవు. వెంటవెంటనే రకరకాల జబ్బులు వచ్చి కోలుకోలేనివిధంగా జీవితం తయారయింది. క్రమంగా జ్ఞాపకశక్తి తగ్గిపోతోంది. ఆఫీసులో కూడా ఇతర ఉద్యోగస్తులతో ఇమడలేకపోతున్నాను. దగ్గరి బంధువులు మూర్తి అని...ఆఫీసులో సాంబమూర్తి అని పిలుస్తుంటారు.

**సి. సాంబమూర్తి, మహబూబ్‌నగర్**

మూర్తి అనే పేరులో 'ఆత్మబలిదానం' అనే 33వ నంబర్ ఉన్నది. మననుండి లాభం పొంది మనకు నష్టం కలిగించే నంబర్ అది. దీని ప్రభావం వలన మీ వద్ద డబ్బులు తీసుకున్నవాళ్లు తిరిగి మీకు ఇచ్చే పరిస్థితి ఉండదు. పైగా మీకు ఇతరులు డబ్బు ఇస్తే...విపరీతమైన ఒత్తిడిచేసి తీసుకుంటుంటారు. మీ మొత్తం సి. సాంబశివరావు అనే పేరులో "బ్రాడింగ్ ఓవర్ ది లాసెస్" అనే ప్రభావం చూపే 45వ నంబర్ ఉంది. దాని చెడు ప్రభావం వలనే మీకు అన్నీ అలా జరుగుతున్నాయి. మీ సంతకంలో కూడా ఒవెల్స్1 కాన్సొనెంట్స్ 6 ఉన్నాయి. వీటిని విధ్వంసకరమైన జంట అని అంటారు. ఆ జంట నంబర్ల వలనే మీరు అనారోగ్యంపాలవుతున్నారు. మీకు లాస్ ఆఫ్ మెమోరీ కూడా దాని ప్రభావం వలనే. అందుకనే మీరు ఇక నుండి **SAMBBAMURRTHI** గా మీ పేరును రాసుకోండి. దానికి 37 అనే ప్రభావవంతమైన నంబర్‌ను జతచేయడం జరిగింది. 4,1,5 మీ లక్కీనెంబర్లు. 37ను హై పొటెన్సియన్సీ నెంబర్ అంటారు. దీనివలన ఇంతకుముందు మీకు జరిగిన బ్యాడ్‌నెస్ అంతా కూడా తొలగిపోతుంది. మీరు సంపూర్ణ ఆరోగ్యవంతమైన జీవితాన్ని గడుపుతారు. అదృష్టవంతంగా సాగిపోతుంది.

★★★

నా పేరు చలపతిరావు. 2-3-1966 లో పుట్టాను. నాకు చేతనైనంతలో సాయం చేస్తూనే ఉంటాను. నాకు అంతా కూడా పనిగట్టుకుని అన్యాయం చేస్తున్నారు. తెలిసి నేను ఎవరికీ హాని చేయలేదు. చేసే ఉద్యోగంలో డెవలప్‌మెంట్స్ ఏమీ లేవు. నాతోటి వారంతా ఇలా వచ్చి అలా ఎదుగుతున్నారు. నేను మాత్రం చేరినప్పుడు ఏ స్థాయిలో ఉన్నానో ఇప్పుడు కూడా అదే స్థాయిలో కొనసాగుతున్నాను. ఇంట్లో కూడా అన్నీ సమస్యలే. తగిన సూచనలివ్వగలరు.

**చలపతిరావు,నల్గొండ**

చలపతి అనే పేరులో సంఖ్యాశాస్త్రం ప్రకారం చెడు ప్రభావం చూపించే నంబర్ 31 ఉంది. దీనిని డెత్ నెంబర్ అంటారు. ఆ నంబర్ ప్రభావం వలనే మీ జీవితం ఇలా ఒడిదుడుకులలో సాగుతోంది. అయితే మీరు ఇకపఅ ఔూఅఖీఖీగా మీ పేరును మార్చుకుంటే దాని మొత్తం సంఖ్య 35 వస్తుంది. దాని ప్రభావం వలన ఇకముందు మీ జీవితంలో ముందుకు దూసుకెళతారు. ఇంట్లో సమస్యలు అన్నీ పరిష్కారం అయి ఆనం దంగా జీవిస్తారు. 2,8 మీ అదృష్ట సంఖ్యలు. మీరు చేసే సహాయ కార్యక్రమాలే మిమ్మల్ని నిలబెడతాయి. ఎన్ని కష్టాలొచ్చినా మీరు అనుకున్నది మా త్రం చేయండి. ఎప్పుడూ ఒకరికి సాయం చేస్తే భగవంతుడు మనకు వేరేరకంగా సాయమందిస్తాడు.



అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తున్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్

# నారి నారి నడుమ ఇగో



కమల్‌హాసన్, గౌతమిలు విడిపోయారు. గతవారం ఇదే హాట్ టాపిక్. అయితే వీరి బ్రేకప్ వెనక ముందుగా కమల్ ముద్దుల కూతురు శృతిహాసన్ పేరు వినిపించింది. కమల్ – గౌతమి కలిసి ఉండేందుకు అస్సలు ఇష్టపడని శృతి ..గౌతమితో పలుసార్లు విబేధించేదని వార్తలొచ్చిన సంగతి తెలిసిందే. ఇదిలా ఉంటే ఈ బ్రేకప్ విషయంలో ఇప్పుడు సీనియర్ హీరోయిన్ రమ్యకృష్ణ పేరు కూడా వినిపిస్తోంది. ఈ సినిమాలో కమల్ సరసన నటిస్తోన్న రమ్యకృష్ణకు గౌతమికి కూడా గొడవ జరిగిందట. గౌతమి డిజైన్ చేసిన ఓ కాస్ట్యూమ్‌ను వేసుకోవడానికి రమ్య ఒప్పుకోలేదట. దీంతో వారిద్దరి మధ్య గొడవ జరగడంతో కమల్..గౌతమిని కాకుండా రమ్యకే సపోర్ట్ చేశాడట.

అటు శృతి వివాదంతో పాటు ఇటు రమ్య వివాదంలో కూడా కమల్ తన అభిప్రాయాన్ని పక్కన పెట్టడం గౌతమిని ఎంతో కుంగదీసిందట. వారంతా తన పనితనాన్ని శంకించడాన్ని గౌతమి తట్టుకోలేకపోయిందట. ఈ చిన్న చిన్న గొడవలే పెద్దవిగా మారి చివరకు కమల్ – గౌతమి విడిపోయేందుకు దారి తీశాయని తెలుస్తోంది.

**రమ్యకృష్ణ:**

పలు భాషల్లో నటించి గొప్ప నటీమణిగా గుర్తింపును సాధించిన రమ్యకృష్ణ ఫార్టీ ప్లస్‌లోనూ మిస్టర్ గిరీశం సినిమాలో కీలక పాత్ర పోషించింది..తాజాగా బాహుబలి చిత్రంలో తన సత్తా చాటింది. ఏజ్ ఎక్కువవుతున్నా గ్లామర్ ఏమాత్రం చెక్కుచెదరకుండా కాపాడుకుంటూనే వస్తుంది. అయితే తన వయస్సు మాత్రం అడిగితే... ఆ ఒక్కటి మాత్రం అడక్కండి.. అంటోంది. సౌత్ ఇండియా చిత్రాల్లో 200 సినిమాలు పూర్తి చేసుకున్న తనకు ఈ ఏడాది మళ్లీ చిత్రాల్లో నటించే అవకాశాలు వస్తున్నాయని, అవకాశం వస్తే మళ్లీ నరసింహ చిత్రంలో నీలాంబరి లాంటి పాత్రల్లో చేయాలనుందని వెల్లడించింది.

కమల్‌హాసన్ నుంచి విడిపోతున్నానంటూ గౌతమి చేసిన ప్రకటన కేవలం సినీ వర్గాలతో పాటు అందర్నీ ఆశ్చర్యానికి గురిచేసింది. పదమూడేళ్లుగా కమల్, గౌతమి కలిసి ఉంటున్న విషయం, వాళ్ల మధ్య అనుబంధం లోకానికి తెలిసిందే. గౌతమి ప్రాణాంతక కేన్సర్ వ్యాధితో బాధపడుతున్నప్పుడు ఆమెకు కమల్ అండగా ఉండటమే కాకుండా, తోడునీడగా నిలిచారు. అలాంటి అనుబంధం పెనవేసుకున్న ఆ ఇద్దరి మధ్య దూరం పెరగడం, ఇప్పుడు అకస్మాత్తుగా కమల్‌తో తెగతెంపులు చేసుకుంటున్నట్లు గౌతమి స్వయంగా బహిర్గతం చేయడం గమనార్హం.

ఇకపోతే... భరతనాట్యం, కూచిపూడి వంటి నాట్యాలలో పలు ప్రదర్శనలిచ్చిన రమ్యకృష్ణ, ఇప్పటి హీరోయిన్లు అవేవీ తెలీయకుండా ఏవేవో డాన్స్‌లు వేస్తున్నారని అంటోంది. అయితే ఈ డ్యాన్స్‌లు చూడటానికి ఆకర్షణీయంగా ఉండటం లేదని చెబుతోంది. వెల్లైమనసు అనే తమిళ చిత్రంతో 13 ఏళ్ళ వయస్సులోనే నటిగా ప్రవేశించిన రమ్యకృష్ణ టాలీవుడ్ అగ్ర హీరోలందరితోనూ అప్పట్లో హీరోయిన్‌గా నటించింది.

ఈ మధ్య కాలంలో మళ్ళీ ఫాంలోకి వచ్చింది స్టార్ యాక్టర్ రమ్యకృష్ణ.

యంగ్ హీరోల మూవీలలో నటిస్తూ హీరోయిన్‌కి ఏ మాత్రం తగ్గకుండా తన గ్లామర్‌తో ప్రేక్షకులని కట్టిపడేస్తుంది. ఇక స్టోరీ ఓరియంటెడ్ రోల్స్‌ని సెలక్ట్ చేసుకుంటూ సినిమా సక్సెస్‌లో తను కూడ ఓ భాగంగా మారుతుంది. దీని కారణంగా రమ్యకృష్ణ రోల్స్‌కి ప్రాధాన్యత పెరిగింది. ఇక రీసెంట్‌గా కమల్ హాసన్ రాజీవ్ దర్శకత్వంలో మరో సినిమా చేయనున్నాడు. ఆ సినిమా కోసం కమల్ హాసన్ స్వయంగా కథని సిద్ధం చేసాడు. ఇందులో హీరోయిన్‌కి తల్లి పాత్రలో కమల్‌కి జోడీగా రమ్యకృష్ణ నటిస్తోంది. ఇది తమిళంలో రమ్యకృష్ణ చేయనున్న క్రేజీ ప్రాజెక్ట్ అని అంటున్నారు. ఇదిలా ఉంటే తాజాగా కోలీవుడ్ సమాచారం ప్రకారం, రమ్యకృష్ణ, రజనీకాంత్ నటిస్తున్న 2.0 మూవీలోనూ ఓ కీ రోల్ చేస్తున్నట్టుగా వార్తలు వినిపిస్తున్నాయి. రజనీకాంత్ సరసన కొద్ది నిమిషాల పాత్రకి రమ్యకృష్ణని శంకర్ సెలక్ట్ చేసినట్టుగా తెలుస్తుంది. త్వరలోనే రజనీకాంత్, రమ్యకృష్ణ మీద వచ్చే సీన్స్‌ని శంకర్ చిత్రీకరించనున్నాడని అంటున్నారు. ఈ న్యూస్ బయటకు రాకుండా 2.0 మూవీ యూనిట్ ఎంత జాగ్రత్తపడినా, ఇది ఏ విధంగా బయటకు వచ్చిందో ఎవ్వరికి అర్థం కావటం లేదంట. కానీ, రమ్యకృష్ణ పాత్ర2.0 మూవీలో చాలా పవర్ ఫుల్ గా ఉండనుందని అంటున్నారు.

**గౌతమి:**

పూర్తిపేరు తాడిమల్ల గౌతమి, తెలుగు మరియు తమిళ సినిమా నటి. ఈమె విశాఖపట్నంలో ఎలక్ట్రానిక్ ఇంజనీరింగ్ చదువుతుండగా సినిమాలలో నటించే అవకాశమొచ్చింది. ఈమె ఏసుక్రీస్తు జీవితగాథను చిత్రీకరించిన దయామయుడు సినిమాతో రంగప్రవేశం చేసింది. ఈమె గురు శిష్యన్

యంగ్ హీరోల మూవీలలో నటిస్తూ హీరోయిన్‌కి ఏ మాత్రం తగ్గకుండా తన గ్లామర్‌తో ప్రేక్షకులని కట్టిపడేస్తుంది. ఇక స్టోరీ ఓరియంటెడ్ రోల్స్‌ని సెలక్ట్ చేసుకుంటూ సినిమా సక్సెస్‌లో తను కూడ ఓ భాగంగా మారుతుంది. దీని కారణంగా రమ్యకృష్ణ రోల్స్‌కి ప్రాధాన్యత పెరిగింది. ఇక రీసెంట్‌గా కమల్ హాసన్ రాజీవ్ దర్శకత్వంలో మరో సినిమా చేయనున్నాడు. ఆ సినిమా కోసం కమల్ హాసన్ స్వయంగా కథని సిద్ధం చేసాడు. ఇందులో హీరోయిన్‌కి తల్లి పాత్రలో కమల్‌కి జోడీగా రమ్యకృష్ణ నటిస్తోంది.

సినిమాతో తమిళ సినిమా రంగములో ప్రవేశించినది. ఇందులో రజనీకాంత్ సరసన నటించినది. ఈమె 1998, జూన్ 4న చెన్నైలోని తాజ్ కోరమాండల్ హోటల్‌లో సందీప్ భాటియాను వివాహమాడినది. గౌతమి, జెంటిల్మన్ సినిమాలో ప్రభుదేవాతో కలిసి డ్యాన్స్ చేసిన చికుబుకు రైలే పాట చాలా ప్రాచుర్యం పొందింది.

కమల్‌హాసన్ నుంచి విడిపోతున్నానంటూ గౌతమి చేసిన ప్రకటన కేవలం సినీ వర్గాలతో పాటు అందర్నీ ఆశ్చర్యానికి గురిచేసింది. పదమూడేళ్లుగా కమల్, గౌతమి కలిసి ఉంటున్న విషయం, వాళ్ల మధ్య అనుబంధం లోకానికి తెలిసిందే. గౌతమి ప్రాణాంతక కేన్సర్ వ్యాధితో బాధపడుతున్నప్పుడు ఆమెకు కమల్ అండగా ఉండటమే కాకుండా, తోడునీడగా నిలిచారు. అలాంటి అనుబంధం పెనవేసుకున్న ఆ ఇద్దరి మధ్య దూరం పెరగడం, ఇప్పుడు అకస్మాత్తుగా కమల్‌తో తెగతెంపులు చేసుకుంటున్నట్లు గౌతమి స్వయంగా బహిర్గతం చేయడం గమనార్హం.

**పదమూడేళ్ల సహజీవనం!**

కమల్ హాసన్ 1978లో వాణి గణపతిని పెళ్లి చేసుకుని పదేళ్ల అనంతరం విడిపోయారు. తర్వాత నటి సారికను వివాహం చేసుకున్నారు. శృతి, అక్షర ఇద్దరు అమ్మాయిలు వీరికి ఉన్నారు. అయితే, కొన్నేళ్ల తరువాత సారిక నుంచి కమల్ విడిపోయారు. ఇదే సమయంలో నటి గౌతమి తన భర్త సందీప్ భాటియా తో విడాకులు తీసుకున్నారు. ఆమె కమల్‌తో 2004 నుంచి సహజీవనం చేస్తున్నారు. ఇప్పుడు పదమూడేళ్ల సహజీవనానికి ఆమె వీడ్కోలు పలికారు.









# సమైక్యతను చాటే వన భోజనాలు

వనభోజనాలు ఈనాటివి కావని పోతన భాగవతంలో రాసిన దాని ప్రకారం అర్ధం చేసుకోవచ్చు. శ్రీకృష్ణుని కాలంలోనూ వన భోజనాల గురించి ఆయన భాగవతంలో ప్రస్తావించారు. వనభోజనాలను ఉసిరి, తులసి, మామిడి చెట్ల క్రింద చేస్తారు. ఉసిరి, తులసి విశిష్టతలు అందరికీ తెలుసు. పరమేశ్వరుడే ఈ భూమి మీద చెట్టుగా వస్తే అది మామిడి చెట్టు. అటువంటి చెట్టు కింద భోజనాలు చేస్తే ఎంతో పుణ్యం లభిస్తుంది. వనభోజనాల వేళ వ్రతాలు , పూజలు ఆచరిస్తారు. దేవునికి ప్రీతికరమైన పదార్థాలు వండి నివేదనగా సమర్పిస్తారు. ఆ తరువాత అందరూ కలిసి ఆ ప్రసాదాన్ని స్వీకరిస్తారు. ఈ భోజనాలు ఆదివారం లేదా సోమవారం చేయడం పుణ్యప్రదం.

**ధార్మిక గ్రంధాలలో ప్రస్తావన:** ఉమ్మడి కుటుంబాలు విచ్ఛిన్నమై, ఆచార వ్యవహారాలు దాదాపు అందరూ మరచిపోతున్న క్రమంలో వనభోజనాలు సమిష్టి తత్వాన్ని పెంపొందించగలవనడంలో ఏ మాత్రం సందేహం లేదు. కార్తీకమాసం అనగానే వనభోజనాల హడావిడి మొదలౌతుంది. ఊరూ వాడా సందడిగా ఉంటుంది. వనభోజనాల ప్రసక్తి అనేక ధార్మిక గ్రంధాల్లో ఉంది. ముఖ్యంగా "కార్తీక పురాణం"లో కార్తీక పౌర్ణమినాడు నైమిశారణ్యంలో మునులందరూ సూతమహర్షి ఆధ్వర్యంలో వనభోజనాలు ఏర్పాటు చేసుకున్నట్లు లిఖితమైంది. ఉసిరిచెట్టు కింద కార్తీక దామోదరునిగా ప్రఖ్యాతుడెన శ్రీహరి ప్రతిమను ప్రతిష్ఠించి, ఉసిరికలతో హరిని పూజించి, గోవింద నామ స్మరణ చేస్తూ షోడశోపచారాలతో పూజించి ఆనక వనభోజనాలు చేశారు. అలా పూర్వం మహర్షులు ఆచరించిన కార్తీక వనభోజనాలు ఇప్పటికీ ఏర్పాటు చేసుకుంటున్నాం. నలుగురితో కలిసి ఆనందిస్తున్నాం. ఇంతకీ కార్తీక వనభోజనాలు ఎలా ఉండాలో ఒకసారి చూద్దాం.

**భక్తి ఆధ్యాత్మిక భావనే మూలం:** పచ్చని చెట్లు, ఆహ్లాదకరమైన వాతావరణంలో కుటుంబ సభ్యులు, బంధు మిత్రుల సపరివారంగా విందు భోజనాలు చేయడం వెనుక భక్తి ఆధ్యాత్మిక భావనలు మెండుగా ఉన్నాయి. (కార్తీక మాసంలో ఉసిరి చెట్ల కింద విష్ణు భగవానుని ఎన్ని పుష్పాలతో పూజిస్తే వాటి సంఖ్యను బట్టి అన్ని అశ్వమేధ యాగాల ఫలం దక్కుతుందని కార్తీక పురాణంలో లిఖించి ఉంది. అందుకే వన భోజనాల సమయంలో ఉసిరి చెట్టు కింద విష్ణు పూజ నిర్వహించి,పంచ భక్షాలతో స్వామికి నివేదించి, అనంతరం బ్రాహ్మణులకు దానాలిచ్చి బంధు,మిత్ర సపరివారంగా భుజిస్తే అఖిలాండ భూమండలంలో ఉన్న సమస్త పుణ్యక్షేత్రాలలో మహావిష్ణువును కొలిచిన పుణ్యం ఫలం దక్కుతుందని ప్రతీతి.

**వన సమారాధన:** కార్తీక మాసంలో ఉసిరిచెట్టుకింద కార్తీక దామోదరుడికి పూజచేసి ,శివునికి అభిషేకం చేసి శివ కేశవుల ప్రసాదంగా భోజనం చేయడం మన అలవాటు. అందరినీ సమానంగా అదరిచడం మన అలవాటు. ఇది అన్ని కులాలవారూ ఆచరిస్తారు. పల్లెలలో ఇది సర్వ సామాన్యం. కార్తీక వన సమారాధన సోమవారం పెట్టేవారు. నేడు ఉద్యోగులెక్కువ కావడంతో దానిని ఆదివారాలకు మనమే అనుకూలంగా మార్చుకున్నాము.కార్తీక మాసంలో వన భోజనాలకు ఎంతో ప్రాధాన్యం ఉంది. ఆధ్యాత్మిక చింతనతో పాటు ఆనందం,ఆరోగ్య సందేశాన్ని కార్తీక వనభోజనాలు మనకు చాటిచెబుతున్నాయి. దేశ సంస్కృతి సంప్రదాయాలను,హైందవ ధర్మ మార్గాన్ని అనుసరించి అనాదిగా వస్తున్న ఎన్నో పర్వదినాలను మనం పాటిస్తూ వస్తున్నాం. ఇందులో భాగమే కార్తీక మాసంలో జరుపుకునే వన సమారాధన కార్యక్రమం. దీనినే కార్తీక వన భోజనాలుగా పేర్కొంటారు. భారతీయ ఆయుర్వేదంలో వృక్ష జాతికి ఉన్న ప్రాముఖ్యత అందరికీ తెలిసిన విషయమే. అందుకే మంచు కురిసే సమయంలో ఉసిరి చెట్టు కింద విష్ణువుకు పూజించి, వండిన ఆహారాన్ని ఆ చెట్టు కిందే ఆరగిస్తే కార్తీక మాసంలో గొప్ప పుణ్యఫలం దక్కుతుందని కార్తీక పురాణం చెబుతోంది. ప్రత్యేకించి ఆదివారాలు, ఇతర సెలవు దినాల్లో కార్తీక వన భోజనాలు సమీప ఉద్యాన వనాలలో, తోటల్లో, నదీ ప్రాంతాలు, సముద్ర తీర ప్రాంతాల్లో జరుపుకుంటారు.

కార్తీక మాసం పరమ పవిత్రమైన మాసం. ఈ మాసంలో అందరూ వన భోజనాలు చేస్తారు. ఉసిరిచెట్టుకింద కార్తీక దామోదరుడికి పూజచేసి ,శివునికి అభిషేకం చేసి శివ కేశవుల ప్రసాదంగా భోజనం చేయడం మన ఆచారం. కార్తీక మాసం అన్నింటా, అందరికీ ఆహ్లాదకర వాతావరణాన్ని పంచుతుందని ముఖ్యంగా శివకేశవులకు ఇష్ట ప్రదాయకమైన నెలగా భావించిన పెద్దలు ఈ నెలలో సమారాధనలు చేయటం శ్రేష్టమైనదిగా చెప్పారు. ఇక ఆహ్లాదకర వాతావరణాన్ని, ఆయుర్వేద గుణాలున్న చెట్లు, మొక్కలపై నుండి వీచే గాలులు పీల్చడం వల్ల కూడా ఆరోగ్యం సిద్ధిస్తుందని భావించిన పెద్దలు ఇలా వనాలలో భోజనాలు ఏర్పాటు చేశారని చెబుతారు. కార్తీక పురాణంలో కార్తీక పౌర్ణమినాడు నైమిశారణ్యంలో మునులందరూ సూతమహర్షి ఆధ్వర్యంలో వనభోజనాలు ఏర్పాటు చేసుకున్నట్లు రాశారు.

**కళా ప్రావీణ్య ప్రదర్శనకు చక్కటి వేదిక:** కేవలం భోజనాలకే పరిమితం కాకుండా ఆట,పాట కబుర్లకు ఇది చక్కటి వేదిక. పిల్లలు,పెద్దలలో ఉన్న సృజనాత్మకతను తట్టిలేపే క్రీ డలు, నృత్యాలు, సంగీత కచేరీలు నిర్వహించడానికి మంచి అవకాశం. వనభోజనాల మధుర స్మృతులు జీవితాంతం గుర్తుండిపోతాయి. మానవ మనుగడకు వనాలు చేసే మేలు అంతా ఇంతా కాదు. భవిష్యత్ తరాలకు కూడా మేలు చేకూర్చే వృక్షజాతిని సంరక్షించాలనే నిగూఢ సందేశాన్ని వనసమారాధన అందిస్తోంది.

**సామాజిక వన భోజనాలెక్కడ?** ప్రస్తుతం కులాల ప్రాతిపదికన అన్ని ఊళ్లల్లో పోటాపోటీగా ఈ కార్తీకమాసంలో వనభోజనాలు జరుగుతున్నాయి. అయితే వాటి స్థానంలో సామాజిక చెతన్యాన్ని రగిల్చే సమసమాజ సామూహిక వన భోజనాలు రావాలని మేధావులు, విజ్ఞులు ఆశిస్తున్నారు. రాజకీయ నేతలలో కొందరు కులాల గంపగుత్త ఓట్లను టార్గెట్ చేసుకుని ఇలాంటి కార్యక్రమాలను నేడు ఉధృాఎతం చేస్తున్నారు. పలనాటి బ్రహ్మనాయుడు ఒకే పంక్తిలో అందరికీ సామూహిక భోజనాలు ఏర్పాటు చేసి చరిత్ర సృష్టించాడు. అన్నమయ్య కూడా తన పాట బ్రహ్మమొక్కటే పర బ్రహ్మమొక్కటే...ద్వారా నాటి కుల వ్యవస్థను దుయ్య బట్టారు. అందుకే ఆధునికంగా, వెజ్ఞానికపరంగా అభివృద్ధి చెందిన నేటి వర్తమానకా లంలోనూ ఇంకా కులాల ముసుగులో మగ్గిపోయేదానికన్నా...విభిన్న సామాజిక వర్గాలన్నీ కలగలిసి సామూహిక సామాజిక వనభోజనాలు చెయ్యవలసిన సమ యం ఆసన్నమయింది.

**అరణ్యాన్ని ప్రేమించాలి** కార్తీక మాసంలో వనభోజనం తప్పని సరి. వనం అనే పదా నికి అరణ్యాన్ని ప్రేమించడమని అర్థమని అమర కోశం చెబుతుంది. కార్తీక మాసంలో వన భోజనానికి ఎందుకు వెళ్లాలి? దీని వెనక ఒక పరమార్థం ఉంది. అరణ్యానికి ఎవడు వెళ్ళాడో వాడు పండడానికి సిద్ధపడ్డాడని గుర్తు. వానప్రస్థంలో అందరూ అరణ్యం లోనే గడుపుతారు. అరణ్యంలో ఎవరి తోనూ సంబంధం లేకుండా ఒక ఆశ్రమం కట్టుకొని, రాగద్వేషాలు లేకుండా, భగవంతుడిని ధ్యానం చేస్తూ గడుపుతారు. దానికి సాధనే వనభోజనం. అందుకే వనభోజనానికి పవిత్రమెన హృాఎదయంతో వెళ్లాలి. ఏ ప్రకృతిలో ఉపద్రవం ఉందో ఆ ప్రకృాతినే ఆశ్రయించి ఆరోగ్యాన్ని సిద్ధింప జేసుకో వాలి. ఆరోగ్యాన్నిచ్చే ఉసిరి చెట్లు, తులసి చెట్లు, మామిడి చెట్లు ఉన్న ప్రాంతాలకు వెళ్లాలి.

**పరమేశ్వర వృక్షమే మామిడి:** ఉసిరి, తులసిల గురించి మనకు తెలుసు. మరి మామిడి విశిష్టత ఏమిటి?. మామిడి చెట్టుకి సంస్కృతంలో రసాలం అని పేరు. పరమేశ్వరుని పేరు ఉన్న ఏకైక చెట్టు మామిడి చెట్టు. పరమేశ్వరుడే ఈ భూమి మీద చెట్టుగా వస్తే అది మామిడి చెట్టు. అటువంటి మామిడి చెట్టు, ఉసిరి చెట్టు, తులసి బృందావనం ఇటువంటివన్నీ ఎక్కడు న్నాయో అక్కడికి వెళ్లాలి. సత్యనారాయణ స్వామి వ్రతం కానీ, మరే ఏ ఇతర వ్రతం గానీ చేయాలి. విష్ణు సహస్రం, శివ సహస్రం, లక్ష్మి సహస్రం, లలితా సహస్రం- ఇవన్నీ సాయంత్రం దాకా చదవాలి. పొద్దు పొడిచిన తరువాత మహా నెవేద్యం పెట్టి భోజనం చేయాలి.

**గోకులంలో వన భోజనం:** ఎవరూ మరచిపోలేనంత గొప్ప వన భోజనం చేసినవాడు శ్రీకృష్ణ పరమాత్ముడు. బలరాముడు, ఇతర స్నేహితులతో- ఓరేయ్, రేపు మనమందరం వనభోజనానికి వెళుతున్నాం రా! అన్నాడు. వాళ్ళు రోజూ వెళ్ళేది ఆ వనానికే. ప్రతి రోజూ మధ్యాహ్నం ఆహారం తినేది కూడా అక్కడే. అలాంటి వాళ్లకు కొత్తగా వన భోజనం ఎందుకు? ఎందుకంటే- వన భోజనం ఎలా ఉంటుందో రుచి చూపించాల నేది ఆయన ఉద్దేశం. అం దరూ పొద్దున్నే లేచారు. గోపాల బాలురకి ఉండే లక్షణం ఏమిటంటే, వాళ్ళు ఉదయం స్నానం చేయరు. సాయంకాలం వచ్చి స్నానం చేస్తుంటారు. అందుకే వారు ఎప్పుడూ చద్ది అన్నమే తింటారు. ప్రతి రోజు మాదిరిగానే అన్నం మూటకట్టుకొని వన భోజనా నికి వెళ్దాం పదండి అని బయలుదేరారు. అక్కడ కృష్ణుడు చూపించిన లీలలు ఒకటా రెండా..! అందుకే వనం అంటే బ్రహ్మం కాబట్టి.. బ్రహ్మాన్ని అరిగించడం.. అంటే కృష్ణభగవా నుడి లీలల్ని ఆస్వాదించటమే వన భోజనం. ఆ వన భోజనంలోపే ఏ అరమరికలూ లేవు. గోపాలురు కృష్ణుడితో తాదామ్యత పొందారు. మనం కూడా వనంలోకి వెళ్ళి ఆ ఉసిరి చెట్టు కింద, తులసి బృాందావనంలో చక్కగా వంట చేసుకుని, పరమేశ్వరుడికి మహా నైవేద్యం పెట్టి, అందరూ ఒక్కటిగా నిలబడి అన్నం తిని, ఆ ప్రకృతి అను గహాన్ని, పర మాత్మ అనుగహాన్ని పొంది ఇంటికి తిరిగి రావడానికి వన భోజనమని పేరు. వనభోజనం ఎందుకు నిర్దేశించారో అందుకే చేయాలి. చేయకూడని పనుల కోసం వన భోజనాలకు వెళ్లకూడదు.

**ఆరోగ్యం కోసం:** కార్తీకమాసం అంటే వర్షాకాలం తర్వాత వస్తుంది. అంటే అప్ప టిదాకా వానలు పడి చిత్తడిగా ఉన్న భూములు పొడివారతాయి. అటు వానలు, ఇటు ఎండలు లేకుండా వాతావరణం ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. అలాంటి వాతావరణంలో నాలుగ్గోడల మధ్య కాకుండా వనంలో అందునా ఔషధ ప్రాయ మెన ఉసిరి చెట్టు కింద భోజనం చేయడం ఆరోగ్యానికి మంచిది. వీలెనంత వరకూ వనభోజనాలు కార్తీక పౌర్ణమి లేదా కార్తీక సోమవారాల్లో ఏర్పాటు చేసు కోవడం ఉత్తమం. వృత్తి ఉద్యోగాలతో కొందరికి తీరుబాటు దొరకని మాటా నిజమే. అలా కార్తీక పౌర్ణమి, కార్తీక సోమవారాల్లో వీలు కుదరని పక్షంలో కార్తీకమాసంలో ఏదో ఒక రోజు పెట్టుకోవచ్చు.



**రిసార్ట్సకే పరిమితం:** వనభోజనం పేరుతో ఇంట్లో కాకుండా ఎక్కడో ఒకచోట భోజనం చేయడం అనుకుని కొందరు హోటల్సు, రిసా ర్ట్సు రిజర్వ్ చేయించుకుంటున్నారు. అలా చేస్తే అది వనభోజనం అనిపించుకోదు. ఏదో మార్పు కోసం సరదాగా తినడం అవుతుంది. మన పెద్దలు ఉద్దేశించిన ప్రకారం కార్తీక వనభోజనానికి ఉసిరిచెట్టు ఉన్న తోట లేదా ఉద్యానవనాన్ని ఎంచుకోవాలి. అక్కడ ఉసిరిచెట్టు కింద భోజనం చేయాలి. కార్తీక దామోదరుడు అని పిలుచుకునే శ్రీహరి విగ్రహం లేదా ప్రతిమను ఉసిరి చెట్టు కింద ఉంచి, పూజ చేసి, ఆనక వనభోజనాలు చేయాలి.

**బంధుమిత్రులతో భోజనం:** బంధువులు, స్నేహితులు, సహోద్యో గులు, ఇరుగు పొరుగువారు, ఒక ఊరివారు - ఇలా రకరకాలుగా కలిసి వనభోజనాలు ఏర్పాటు చేసుకుంటున్నారు. ఒక్కొక్కరూ ఒక్కో పదార్థం తయారుచేసి తీసుకురావడం ఒక పద్ధతి కాగా, అందరూ తలా ఇంత అని డబ్బు చెల్లించి, కేటరింగ్ చెప్పడం మరో పద్ధతి. మొత్తానికి మామూలు కూరలు, పచ్చళ్ళ తోబాటు గోంగూర పచ్చడి, ఉలవచారు, పులిహోర, బొబ్బట్లు, గారెలు, పూర్ణాలు లాంటి ప్రత్యేక వంట కాలతో ఆహా అనిపించే రుచికరమెన భోజనం చేయడం ఆనవాయితీ. వనభోజనానికి ముందు వెనుక రోజూవారి రొటీన్‌కు భిన్నంగా అందరూ ఆటపాటలతో హాయిగా, ఆనందంగా గడుపు తారు. మనదేశంలోనే కాకుండా ప్రవాసాం ధ్రులు కూడా కార్తీక వనభోజనాలు ఏర్పాటు చేసుకుని ఆనందిస్తున్నారు. కేవలం ఆంధ్రులే కాదు తమిళులు తదితర దక్షిణభారతీయులు వన భోజన మహోత్సవాలు జరుపుకుంటున్నారు.

**సమైక్యతను పెంపొందించే భోజనాలు:** కార్తీక వనభోజనాలు స్నేహాన్ని, సమెక్యతను పెంపొందిస్తాయి. పరస్పరం ఆహార పదార్థాలు పంచుకు తినడంవల్ల భిన్న రుచులు అనుభూతికి రావడమే కాకుండా నచ్చినవాటిని నేర్చుకోడానికి అవకాశం లభిస్తుంది. దెనందిన జీవితంలో ఎదురయ్యే చిరాకులు, పరాకులకు దూరంగా అందరూ కలిసి వేడుక చేసుకోవడం వల్ల వత్తిళ్ళు, వేదనలు తీరతాయి. వనభోజనాలను పెద్దల కంటే పిల్లలు మరీమరీ ఆనందిస్తారు.

కార్తీక మాసంలో ప్రతి ఇల్లూ ఓ గుడిగా, ప్రతి గుడీ ఓ పుణ్యక్షేత్రంగా మారిపోతుంది. ఇక ఏడాదిలో ఎప్పుడు కుదిరినా కుదరకున్నా బంధువులను, ఆప్తమిత్రులను కలిసి వారితో సమయం గడిపేందుకు వనభోజనాలు గొప్ప సందర్భాలు. కార్తీక పురాణంలో వనభోజనాల ప్రసక్తి ప్రముఖంగా కనిపిస్తుంది. కార్తీక మాసంలో ఉసిరి చెట్టు ఉన్న వనంలో, విష్ణుమూర్తిని అర్చించి వనభోజనం చేసినవారి సకల పాపాలూ తొలగిపోతాయన్నది పురాణంలోని మాట. ఈ సంప్రదాయాన్ని తరచి చూస్తే వనభోజనానికి ఎందుకంత ప్రాధాన్యతో అర్థమవుతుంది.

**వృక్షారాధన:** విగ్రహారాధన ఏర్పడక ముందు, మన పూర్వీకులు ప్రకృతినే పూజించేవారు. వారి దృష్టిలో తమకు ఆహారాన్నీ, నీడనూ, నారబట్టలనూ అందించే వృక్షాలు గొప్ప దేవతలు. సంస్కృతి ముందుకు సాగినా భారతీయులు ఆనాటి మూలాలను మర్చిపోలేదు. మనిషి ఎంతగా ఎదిగినా ప్రకృతికి లోబడక తప్పదని వారికి తెలుసు. అందుకే వృక్షాలను కూడా దేవతార్చనలో భాగం చేశారు. ఫలం, పుష్పం, పత్రం లేకుండా మన పూజలు సంపూర్ణం కావు. వినాయక చవితి, క్షీరాబ్ది ద్వాదశి వంటి సందర్భాలలో అయితే వృక్షాలదే ప్రధాన పాత్ర. అలాంటి వృాఎక్షాలలో ప్రధానమైన ఉసిరికి కార్తీక మాసంలో వీలైనంత ప్రాధాన్యతను ఇచ్చారు. ఈ మాసంలో ఉసిరి చెట్టును సాక్షాత్తూ విష్ణుమూర్తిగా భావించి పూజించాలన్నది పెద్దల మాట. నలుగురూ కలిసి ఓచోటకి వెళ్లి సరదాగా గడపాలంటే, ఇప్పుడంత కష్టం కాకపోవచ్చు. అయితే రవాణా సదుపాయాలు కానీ, జీవణ ప్రమాణాలు కానీ గొప్పగా లేని రోజుల్లో అదో జీవితకాలపు అనుభవం! కార్తీక మాసం రాగానే అందరికీ అనువైన ఓ మంచి రోజు చూసుకుని దగ్గరలోని వనంలో కలుసుకునేవారు.









# వింతలు- విడ్డూరాలు



ఓ(O)అనే ఆంగ్ల అక్షరముతో మొదలయ్యే రాజధానులు ప్రపంచములో మూడు (3)దేశాలకే ఉన్నాయి. అవి . 1.అట్టావ (కెనడా),2.ఓస్లో(నార్వే),ఔగడౌగౌ (బుర్కినా పాసో).

వందసార్లు పెద్దగా నవ్వడం వల్ల ఖర్చయ్యే శక్తి పదిహేను నిమిషాలు సైకిల్ తొక్కడం వల్ల ఖర్చయ్యే శక్తితో సమానం.



Mother and child Laughing



Snow on the Earth-12/10/2013



Gim for obese




' ఎల్పీజీ సిలిండర్లకు ఎక్స్పైరీ తేదీ ఉంటుంది. సిలిండర్ పైభాగంలో ఉండే ముచ్చెలపై ఎ,బి,సి,డిలలో ఏదో ఒకటి ఉంటుంది. ఇవి ఏడాదిలో మూడేసి నెలలకు చిహ్నాలు. దీని తరవాత అంకె ఉంటుంది. ఉదాహరణకు 'ఏ12' అని ఉంటే... ఆ సిలిండర్ మార్చి 2012 తరవాత వాడటానికి పనికిరాదన్న మాట.

కొందరు తమ కనుగుడ్లు కదలికల శబ్దాన్ని కూడా వినగలుగుతారు.





ముక్కులు, పైపెదవులు తాకేలా పెట్టుకునే ముద్దును ఎస్కివో కిస్ అంటారు.

Eskivo Kiss



తనకి తాను యజమాని కాలేని మనిషి ఎన్నటికీ స్వతంత్రుడు కాలేడు - ఎపిక్టిటస్

## కథ

# మగువ- తెగువ

నరెద్దుల రాజారెడ్డి

ఇప్పటిదాక ప్రశాంతంగా వున్న ఆకాశం. క్రమేపి దట్టమైన మేఘాలతో నిండిపోయింది. ఒక్కొక్క చినుకుతో మొదలై జడివానలా కురవసాగింది. ఒక్క ఉరుము ధ్వనితో ఆలోచనలనుండి తెలుకున్నాను. అత్తయ్య వచ్చి తలపై మొటిక్కాయవేసి తిట్ల దండకం మొదలు పెడితేగాని స్ఫురణకు రాలేదు. ఇంటి ప్రాంగణంలో ఆరవేసిన మా ఆయన ఫ్యాంటు, షర్టు.

తొందరగా లేచి, ఆరుబయటకు అడుగులు వడివడిగా వేసాను. హృదయంలో గుండె మెకాల్లోకి జారినట్టు ఐంది కాకు బట్టలు పూర్తిగా తడిచిపోయాయి. ఒక కాసేపట్లో శ్రీవారు ప్రయాణమై వెళుతున్నారు. ఈ పాటికి ఐరన్ చేసి పెట్టాల్సింది. ఎలాగు చీవాట్లు, చెంపదెబ్బలు తప్పేలా లేవు.

"ఏమే....బట్టలు ఐరన్ చేసావా..?" అది మా ఆయన కంఠం... వినపడగానే ఒళ్ళు జలదరించింది. తడిసిపోయిన బట్టలు చేతిలో పట్టుకున్ననాకు. శరీరం ఒణుకు పుట్టింది. విషయం తెలుసుకున్న మా వారు కళ్ళల్లో అగ్ని పర్వతం బద్దలు చేస్తూ... తన చూపు కిరణాలను బాణాలుగా సంధించి నా ఒళ్ళును తూట్లు తూట్లు పొడిచినంత పని చేస్తాడు.

ఆ ఇంట్లో నేను నిస్సహాయకురాలిని. తెలియక చిన్న తప్పు చేసినా క్షమాభిక్ష పెట్టే గుణం ఆ ఇంట్లో ఎవ్వరికి లేదు. 'నా అనేవారు ఎవరు లేకపోయినా...పోతే ప్రాణమని నమ్మిచ్చిన నాకు. ఆ పోతే ప్రాణం మీదకు వచ్చినప్పుడు నాలో ప్రాణం వుండే ప్రయోజనం లేదనుకున్నాను. ఆత్మహత్యే శరణ్యం అనుకున్న రోజులు చాలా వున్నాయి. ఆలోచన విరమించుకున్నాను. ఆత్మహత్య చేసుకున్న వారు ఏమి సాధించారు...? ఈ ప్రశ్న నా మెదడులో అనేకసార్లు నెమరు వేసుకున్నాను. కష్టాలు, కన్నీళ్ళు, వెక్కిళ్ళు చాలా సమయం నిలబడవని నాకు ముందే తెలుసు. నవ్వుకునే రోజులు కూడా వస్తాయని తెలుసు. అందుకే ఓర్పుతో బాధల్ని బరిస్తూ వస్తున్నాను.

బట్టలు ఉతికి ఐరన్ చేసి పెట్టడం దగ్గర్నుంచి వంటపని మొదలుకొని పడుకొనేముందు...పడకలు సర్దేవరకు అన్ని నేనే చేయాలి ఇంటికి పెద్ద కోడల్ని పైగా కోరితెచ్చుకున్న దాన్ని అత్తవారి ఇల్లు ఒక సముద్రం... అందులో నేను ఒక కెరటం.... ఎంత ఎగసి పడినా... తిరిగి సముద్రంలోకి కలిసిపోక తప్పదు.

భగవంతుడు ఎప్పుడు ఇం తే.... మంచికి చెడుకు తోడు చేస్తూ... తమాషా చూస్తుం టాడు.. ఆడదానికి మగాడే (భర్తే) కవచం... అలాంటి కవచమే పాశానంగా మారిపోతే గతేంటి..? ఇలా ఆలోచించే లోపే దగ్గరికి వచ్చేసాడు మా ఆయన.. నా చెంప చెల్లుమని వా యించాడు. దాంతో ముఖం ఊడినట్టు అయింది. భయంతో మా వారి కళ్ళల్లోకి చుస్తూనే నా కంట్లో నీరు ఆవేశమైంది. మెట్టినింట్లోకి ఏ గడియల్లో అడుగు పెట్టానో కానీ... ఆ క్షణం నుంచి నా కళ్ళు జీవనదులై కన్నీళ్ళను పారుతూనే వున్నాయి.

"ఎంత పొగరే నీకు... బట్టలు బయటే వున్నాయన్న ఇంగితజ్ఞానం కొంచెమైనా లేదా... ఎక్కడ దాపురించావే నాకు.." అంటూనే మరోదెబ్బ వేసాడు. మొద్దు బారిన నా శరీరం మీద ఆ దెబ్బలేమి పనిచేయలేదు. "వద్దురా అంటే నా మాట విన్నావా? అందంగా వుందని తెగ మురిసిపోయావ్... ఇది ఏ ఏనాడు మన కొంపలోకి అడుగు పెట్టిందో గాని అప్పట్నుంచి శని దాపురించింది.."

అక్కడే వున్న అత్తగారు నా ముఖం మీద ఉమ్మేసి కొంగు విసురుగా తిప్పుకొంటూ లోపలికెళ్ళింది. అంత వర్షంలో కూడ చలి అన్నది కూసింతైనా నా శరీరానికి తగల్లేదు... దిగులుతో వేడెక్కింది. లోపలికెళ్ళాను చిన్న కోడలు తన ముద్దుల చంటోడికి పాలు తాగిస్తూ సోఫాలో కూర్చుంది.

అత్తగారు రుసరుస మంటూనే గుమ్మానికి అనుకొని వుంది. నన్ను చూస్తూనే నిప్పులు చెరుగుతోంది.

"పెళ్ళయిన ఇన్నేళ్ళయిన ఇంకా బిడ్డ పాప లేదు... పుట్టుగొడ్రాలు... అష్టదరిద్ర దేవదలా తగలడింది... ఎప్పుడు ఊడుమందోగాని... అప్పుడు గాని మాకు పట్టిన శని వదలదు..." అత్తయ్య నోటి నుండి బాకుల్లా దూసుకొస్తున్నాయి. ఈ మాటలు వేధించడం వారి వంతు... భరించడం నా వంతు రోజూ దిన చర్య ఇదే... కాస్త విరామం దొరికేపాటికి... గత జ్ఞాపకంతో నా మనసు సందిగ్ధంలో పడిపోయింది.

★ ★ ★

నా చిన్న తనంలోనే మా నాన్న అనారోగ్యంతో కన్నుమూసాడు. కొడుకులు లేని లోటు నాతో తీర్చుకోవాలని ఉబలాట పడింది మా అమ్మ. కష్టపడి కాలేజ్‌కు పంపింది. అప్పట్లో నా ప్రాణ స్నేహితురాలు కృష్ణవేణి. ఇద్దరం కలిసి కాలేజ్‌కు వెళ్ళేవాళ్ళం. నాకు కవితలు రాయడమంటే చాలా ఇష్టం. కృష్ణవేణికి చంద్రశేఖర్ అనే అబ్బాయి పరిచయం అయ్యాడు. మేము వెళ్ళే దార్లోనే వారిల్లు... కాలేజ్‌కు వచ్చేటప్పుడు మాతో కూడి వచ్చేవాడు.

ఒక రోజు కాలేజీలు ఫంక్షన్‌ను ఏర్పాటు చేసారు. అందరూ హాజరయ్యారంట. ఆ రోజు మా అమ్మకు ఒంట్లో బాగలేదు. ఆ పరిస్థితిలో అమ్మను విడిచి ఫంక్షన్‌కు పోదలచుకోలేదు. కృష్ణవేణి ఫంక్షన్‌కు రమ్మని బలవంతం పెట్టింది అమ్మ 'సరేవెళ్ళు' అనడంతో వెళ్ళాను.

ఫంక్షన్‌కు వెళ్ళానన్న మాటేగాని, మనసంతా ఇంటివైపే వుంది. స్టేజీపైన డ్యాన్స్ ప్రోగ్రామ్ జరుగుతోంది. అది ముగిసాక కవితల పోటీ ప్రారంభమైంది... స్త్రీ జీవితం... పెళ్ళి వరకట్నంపై కవితలు రాసి... చదవాలి... బాగున్న వాటికి బహుమతులు అందజేస్తారు... ఒక్కొక్కరు వచ్చి వారు రాసిన కవితలు రాగబరితంగా చదవడం మొదలు పెట్టారు... దాంతో నాకు స్నేహితుల వత్తిడి ఎక్కువైంది. ఏదైన మంచి కవిత రాసి చదవాలని ఒత్తిడి చేస్తారు. అప్పుడు ఏమి చేయాలో దిక్కు తోచలేదు. పెన్ను, పేపరు పట్టుకున్నానన్న మాటేగాని... ఆలోచనల్లో మార్పులేదు.. అంతా అయోమయంగా తయారైంది.. బాగా ఆలోచించాను..ఏ రచయితకైనా స్పందించే గుణం.. క్రియేటివిటి వుండాలంటారు. అర్థరాత్రిలో లేపి సందర్భం ఇస్తే.. వర్ణించి వివరించే సమయస్ఫూర్తి, వుండాలంటారు.. రాశాను.. ఒక స్త్రీగా సాటి స్త్రీ యొక్క భవిష్యత్తును రాసాను...

అంతే నాకు తెలియకుండానే కలంనుండి అక్షరాలు కవిత రూపంలో పేపర్లోకి జాలువారాయి.. స్టేజి ఎక్కాను... అందరూ నావైపే ఆత్రుతగా చూడసాగారు. వరకట్నం పేరుతో రాసిన కవిత చదవడం మొదలు పెట్టాను.

అంటూ బావోద్వేగంగా ముగించాను... కరతాళ ధ్వనులతో మ్రోగిందా ప్రాంతం ఊహించని విధంగా నా కవిత ప్రథమ స్థానంలో నిలిచింది.

బహుమతితో బాటు... కొంత నగదు కూడా చెల్లించారు. దాంతో మా అమ్మ అనారోగ్యం నయం చేయించాను. అలా అందరి ప్రశంసలు అందుకున్న నా పట్ల చంద్రశేఖర్ మరింత చనువు చూపాడు. ప్రేమ దోమా అంటూ వెన్నంటి రాసాగాడు. కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటానని... ఏ లోటు రాకుండ చూసుకుంటానని... మా అమ్మతో మెప్పించి...నా ప్రేమను ఒప్పించాడు.

మాకు వున్న పాత ఇళ్ళు... రెండెకరాల పొలం... అతను మాట వరుసకు వద్దన్నాకూడా... మాట పడకూడదని అమ్మా రాసిచ్చి. అమ్మవారి గుడిలో... నలుగురు పెళ్ళి పెద్దల సమక్షంలో సాదాసీదాగ జరిపేసింది. కొంత కాలానికి అమ్మ కాలం చేసింది..దాంతో అత్తగానే మా అమ్మగా రనుకున్న నా ఆశ అచిరకాలంటనే మొద్దై రాలిపోయింది.

మా వారికి అనుకోకుండ వ్యాపారంలో నష్టం వచ్చింది. దాంతో సతసతమై మా వారు నన్ను పట్టించుకోవడం మానేసారు. నాతో కట్నం డబ్బులు తెమ్మనడానికి నా దగ్గర ఏమీ లేదని తెలుసు... అందుకే నన్ను... ఆ రోజునుండి ఈ రోజు వరకు ఆట బొమ్మలా ఆడించడం మొదలు పెట్టారు.. మగువకు తెగువ వుండాలని కాలేజ్ రోజుల్లో కవిత రూపంలో వివరించినంత సులువుగా... నిజ జీవితంలో ఆచరించలేక పోతున్నాను.

ఇలా ఆలోచిస్తుంటే... బయట కారు ఆగినట్టు శబ్దం రావడంతో... గతం నుండి వర్తమాన కాలంలోకి ఊడి పడ్డాను.

★ ★ ★

కారు కీ చైను తిప్పుచూ డ్రైవర్ లోపలికి వచ్చాడు. అప్పుడు సరిగ్గా అత్తయ్య వంట గదిలో నుండి బయటికి వచ్చింది. "డ్రైవర్‌కి కాఫీ ఇవ్వు" గదుసుగా ఆ మాట అని బయటికి నడిచింది. లోపలికెళ్ళి కాఫీ వడబోసి తెచ్చాను. గుమ్మంలోకి సూట్‌కేస్‌తో ఎదురొచ్చిన మా ఆయన కళ్ళల్లో ఆనందం ఉట్టిపడుతోంది.



"నీరజ... డ్రైవర్‌కి కాఫీ ఇచ్చావా... వెరీ గుడ్... తొందరగా రెడిగా... వెళ్ళాలి" పెళ్ళయిన కొత్తలో పేరుతో పిలిచే వాడు... కొద్ది రోజులకు ఆ ప్రేమ అనంత విశ్వంలోకి ఆవిరైపోయింది... ఒసేయ్.. రావే..పోవే.. అంటూ పిలిచేవాడు... ముద్దుగా పేరు పెట్టి పిలుస్తుంటే... అనుమానంతో బాటే ఆశ్చర్యం వేసింది... "ఎక్కడికీ..." అంటూ అడిగాను... "మనకు పెళ్ళయ్యి ఇన్నేళ్ళు గడుస్తున్నా ఇంకా పిల్లలు కాలేదు... పొరుగూరి అమ్మవారికి ముడుపుకడితే పిల్లలు పుడతారంట... అందుకే వెళ్తున్నాం..." బ్రీఫ్‌కేస్ బీరువాలో సర్దుతూ అన్నాడు... మూఢ నమ్మకాలకు మూడు మైళ్ళు దూరం వుండే మా వారు ముడుపులు గురించి మాట్లాడుతుంటే నా నోటంట మాట రాలేదు.

చక చక సామాన్లు సర్దేసి, కదుపు తీపితో కాదనలేక మా వారు అత్తయ్యతో బాటు కదిలాను.

"ఇల్లు జాగ్రత్తమ్మ... మేం తొందరగా వచ్చేస్తాం... దిలీప్ రాగానే హాట్ బాక్స్‌లో కూర్మవుంది... మరచి పోకుండా వడ్డించు..." చిన్న కొడుకంటే అత్తయ్యకు ప్రాణం... ముందుగానే చిన్న కోడలకు జాగ్రత్తలు వివరించి కారెక్కింది.

కారు బయలు దేరింది... మెయిన్ రోడ్ దాటి మెటల్ రోడ్‌లోకి మలుపు తిరిగింది... సుమారు పదిహేను మైళ్ళు వెళ్ళగానే... రెండు కొండల మధ్య ఇరుకైన రహదారిలో ఆగింది కారు... అందరం దిగాము... ముం దర ఇంకో కారు చెట్లమాటున ఆగివుంది. అక్కడ ఇద్దరు మనుషులు నిల్చోని మాట్లాడుకొంటున్నారు. మా ఆయన నేరుగా వాళ్ళ దగ్గరకి వెళ్ళాడు. తిరిగి వాళ్ళతో కూడి మా దగ్గరకి వచ్చాడు. న్యూస్‌పేపర్స్ కారులోనుండి తీసి నా చేతికి అందించాడు.. నాకేమి అర్థం కాలేదు.

"అవి ఎందుకిచ్చారో తెలుసా..... ఒకడు అదనపు కట్నం ఇవ్వలేదని భార్యను హింసించి చంపేసాడు... మరొక ప్రబుద్ధుడు ఏకంగా భార్యకు నిప్పంటించాడు... ఇలాంటి వార్తలు ఆ పేపర్‌లో వున్నాయి... కావాలంటే చదువు... నేను వాళ్ళంత కసాయి వాన్ని కాను... నువ్వు ఏమీ ఇవ్వలేవు కాబట్టి నేను చెప్పినట్టు నువ్వు వినడం బెటర్... నీకెలాగు బిడ్డల్లేరు... కాబట్టి నువ్వు ఎక్కడున్నా ఒక్కదే... ఏదో నా అదృష్టం కొద్ది దూరపు సంబంధం ఒకటి కలిసొచ్చింది. కట్నం కూడా ఎక్కువే ఇస్తామంటున్నారు...నాకింకా పెళ్ళి కాలేదని వాళ్ళను నమ్మించాను. ఈ ఊళ్ళో అందరు నా మనుషులే... ఎట్టి పరిస్థితిలోను ఎవ్వరు నా మేటర్ లీక్ చేయదు. నువ్వు కొద్ది రోజులు ఈ బాంబే గేటు దగ్గర వుండిపో... శేటు చాలా మంచివాడు.. నీకు ఏలోటు రానివ్వడు. పెళ్ళి అయిపోగానే... పని మనిషిగా నిన్ను నా రెండో భార్యకు పరిచయం చేసి ఇంట్లోకి తీసుకుంటాను. ఒక పని పనిషిగా మాకు పరిచర్యలు చేస్తూ... తృప్తి పొందుదువు ఏమంటావ్? ఎలా వుంగి నా ప్లాన్ చాలా సింపుల్‌గా వుంది కదూ...."

ఆ మాటకు నా ఒళ్ళుపై జెర్రిలు పాకినట్టు జలదరించింది... అర్థమైంది... ఇది పచ్చిమోసం... ఇంట్లో బీరువాలో బ్రీఫ్‌కేస్ సర్దగానే నాకు డౌటు వచ్చిం ది. అది డబ్బు... అంతే... ! నన్ను ఆ శేసుకు అమ్మేస్తున్నారన్నమాట... ఇక ఎప్పటికి నేను తిరిగి రాను... భయమే సింది... నా మౌనంలోనే ఆగ్రహం మెల్ల మెల్లగా పుంజుకుంది.

"నడు ముందుకు.... నడవే.... ముదనష్టపు దాన..." అంటూ అత్తయ్య నన్ను మెడపట్టి ముందుకు తోయగానే నాలో కోపం బుసలుకొట్టింది... అంతే... ధైర్యం కూడ దీసుకొని అత్తయ్య చెంప పగలు గొట్టాను. "అంటే మమ్మల్ని నమ్ముకొని వచ్చిన నన్ను అమ్ముతున్నారా! అసలు నువ్వు ఆడదానివేనా? డబ్బు మైకంలో సాటి ఆడదానికే ఇంత విపరీతాన్ని కల్పిస్తున్నావే... ఇక మగాడు ఊరుకుంటాడా?" ఎప్పు డూ ఇలా అనిన దాన్ని కాదు... కోపంలో అనేసాను.

కట్నం కోసం.... అత్తగానే కోడల్ని చంపిన కథనాలు చాలా విన్నాను. చదివాను. కట్నం కోసం అదడే సాటి అదదాని ఉసురు తీస్తుంటే... ఈ లోకంలో మగువకు బద్రత ఎక్కడుంది! వ్యభిచార గృహానికి అమ్మేసి చేతులు దులుపుకోటానికి యత్నిస్తున్న మా వారిని చూస్తుంటే నా గుండెల్లో అగ్ని గుండం బద్దలైంది.

మా వారు నన్ను కార్లోకి నెట్టడానికి ప్రయత్నించారు. చేతుల్లోకి సత్తువ కూడ దీసుకోక తప్పలేదు. పక్కనే వున్న బండ రాయి తీసి మా వారి కాలుపై వేసాను.. "అబ్బా అంటూ మా వారు అరవగానే "ఏమైందిరా..." అంటు అత్తయ్య నన్ను వదిలేసి మా వారి వైపు దృష్టి సారించింది.

పక్కనే వున్న శేటు కంగారు నుండి తేరుకునేలోపే కాళ్ళకు బుద్ధి చెప్పాను. మౌనం పనికి రాదని తెలుసు... పిరికి తనం దేన్నయినా సాధిస్తుంది... నాలో మా నవతావాది కంఠం తెంచుకుంది. నేరుగా నా పయణం కృష్ణవేణి దగ్గరకు సాగింది. అక్కడి నుంచి నేరుగా మహిళా సంఘం అధ్యక్షురాలు మీనాక్షిని కలిసి... నా కన్నీటి ఘోడును వెల్లబోసుకున్నాను. అంతే... మహిళలు రెచ్చిపోయారు... చంద్రశేఖర్‌ని అత్తగారిని లాక్కొచ్చారు... ఊరి నడిబొడ్డులో ఇద్దర్ని దుమ్ముదులిపేసారు. బాంబే శేటును పోలీసులకు అప్పగించారు. వ్యభిచార కూపంలో ఇరుక్కుపోయి... నానా యాతన పడుతున్నవారు విముక్తులయ్యి స్వేచ్ఛా ప్రపంచంలోకి విడుదల అయ్యా రు... ఒక్క ఆడది తిరగబడినందుకు... ఇంత మంది జీవితాలు కుదుట పడినందుకు చాలా గర్వపడ్డాను... ఆడదంటే అలుసుకాదు... మనతో చివరిదాక నడిచే ఒక మహత్తరమైన దేవతని తెలుసుకొని... జ్ఞానోదయం పొందిన మా వారు నన్ను తిరిగి చేరదీసినప్పుడు నాలో సంతోషం పొంగిపోయింది. పశ్చాత్తాపడిన అత్తయ్యను చూసి.. ఆనందం ఉరకలేసింది..

# సూర్య బుడత





## దారిని కనుక్కోండి



## రంగులు వేయండి




## తేడాలు గుర్తించండి



## సకల ప్రాణ కోటికి నీరే ప్రకృతి ప్రసాదించిన సంజీవిని

పిల్లలూ మీకు తెలియని కొన్ని నీటి వాస్తవాలు. ప్రకృాఎతి ప్రసాదించిన గొప్ప వరం. స్వచ్ఛమైన నీటికి ఎటువంటి వాసన మరియు రుచి కలిగి ఉండదు. అద్భుతమైన నీటి ఉపయోగాలు మరియు అవసరం ప్రతి జీవికి ఎంతో ముఖ్యం. హైడ్రోజన్ మరియు ఆక్సిజన్, అను రెండు వాయువుల సమ్మేళనం తో నీరు తయారు అవుతుంది. నీటి ప్రతి అణువు ఒక ఆక్సిజన్ పరమాణువుకు, రెండు ఉదజని అణువుల సమ్మేళనం తో తయారు అవుతుంది. అందుకే దీని రసాయన ఫార్ములా 2 అయింది. నీటి ఉనికి భూమిమీద అత్యవసరం. నీటి రూపాలు మూడు, ద్రవ, ఘన మరియు వాయువు రూపం లో ఉంటుంది. నీరు సాధారణంగా దాని ద్రవస్థితిలో నీటి ని సూచిస్తుంది. భూమి ఉపరితలం చుట్టూ 70% నీరు ఆక్రమించింది. భూమి మీద మూడు అతిపెద్ద సముద్రాలు పసిఫిక్ మహాసముద్రం (పెద్దది), అట్లాంటిక్ మహాసముద్రం (రెండవది) మరియు ఇండియన్ ఓషన్ (మూడవ అతిపెద్ద). పసిఫిక్ మహాసముద్రవు, మారియానా ట్రెంచ్ ప్రపంచ మహా సముద్రాల లోతైన కేంద్రము. సముద్రంలో అలలు భూభ్రమణం, భూమి, చంద్రుని మరియు సూర్యుని యొక్క గురుత్వాకర్షణ శక్తి వల్ల కలుగుతాయి. సగటున, ప్రతి కిలో బరువు సముద్ర జలాలలో 35 గ్రాముల కరిగిన ఉప్పు ఉంటుంది. నీరు ఘనీభ విన్చి నప్పుడు మంచు గడ్డ గా వ్యాకోచిస్తుంది. అందుకే మంచు కొండలు ఓడలాగా నీటి పై తేలతాయి,. సముద్రజలం – 2 ఓ సె (28.4 ఓ ఫా) వద్ద ఘనీభవిస్తుంది, ఇందుకు కారణం సముద్రములోని ఉప్పే. ప్రపంచంలో అతి పొడవైన నది, నెలు .దీని పొడవు 6650 కిలోమీటర్లు నేలపై ప్రవహిస్తుంది. ప్రపంచంలోని రెండవ పొడవైన నది, అమెజాన్ దీని పొడవు 6400 కిలోమీటర్లు నేలపై ప్రవహిస్తుంది. తరువాత పొడవైన నది మిస్సోరీ ఉంది, దీని పొడవు సుమారు 3,770 కి.మీ. నీటి లో కొన్ని ఖనిజాలు, లవణాలు మరియు ఆమ్లాలు సులభంగా తన లో కరిగించి ఒక ద్రావణం చేస్తుంది. నూనెలు మరియు ఇతర కొవ్వులు నీటిలో కరగవు. స్వచ్ఛమైన జలం ఏ వాసన మరియు రుచి కలిగి ఉండదు. జల ఆవృాఎత్తం వలెనే మొక్కలు, సకల ప్రాణకోటి భూమి మీద ఉండగలుగుతోంది. ద్రవ రూపంలో ఉన్న నీరు సూర్య వేడికి ఆవిరిగా మారి ఆకాశ మర్గాన గాలి వలన పయనించి మేఘముగా ప్రయాణించి, వాతావరణం లోని చల్ల దనానికి నీటి ఆవిరి వర్షం రూపంలో ఆకాశం నుండి మంచు లేదా వడగళ్ళ గా భూమి పై తిరిగి పడిపోవడం అక్కడనుండి కాలువల ద్వారా నదులకు, అక్కడనుండి సముద్రాలకు చేరటం, ఇలా నిరంతరం జరుగుతుంది. నీటి ని మంటలు చల్లార్చుటకు అగ్నిమాపక సిబ్బంది తరచుగా ఎక్కువగా ఉపయోగిస్తారు. నీటి పరిశ్రమ ప్రపంచవ్యాప్తంగా వివిధ నగరాలలో గృాఎహాల కు పరిశ్రమలకు మరియు దేశ దేశాలకు రవాణా సాధనం గా సహాయపడుతుంది. జనరేటర్ల ప్రక్రియ ద్వారా జల ప్రవాహ శక్తి నుండి విద్యుత్ రూపొందించవచ్చు. ప్రపంచ వ్యాప్తంగా అనేక జలవిద్యుత్ విద్యుత్ కేంద్రాలు ఉన్నాయి. నీరు కూడా ఫన్ కోసం ఉపయోగిస్తారు. వాటర్ స్పోర్ట్స్ చాలా ఉల్లాసభరితమైన కార్యం మరియు ఈత, సర్ఫింగ్ మరియు వాటర్ స్కీయింగ్ వంటి పలు ఆటలు ఉన్నాయి. ఐస్ మరియు మంచు కూడా మంచు స్కేటింగ్, ఐస్ హాకీ, స్కీయింగ్ మరియు స్నోబోర్డింగ్ ఆటలకు ఉపయోగిస్తారు. ప్రతి ప్రాణికి వంట్లోని నీరు తగ్గితే రక్తం చిక్క పడుతుంది, ఎక్కువ చిక్క పడితే రక్త ప్రవాహానికి అంతరాయము కలిగి ప్రాణం పోతుంది, అందుకే దాహం వేయగానే వెంటనే నీరు తాగితే మరల రక్తం గడ్డ కట్టకుండా కాపాడుతుంది, అలాగే మొక్కలకు నీళ్ళు లేకపోతే ఎండి పోయి చనిపోతాయి.అందుకే సకల ప్రాణి కోటి కి నీరే ఆధారం. ఇది నిజంగా ప్రకృాఎతి ప్రసాదించిన వరం, సకల ప్రాణ కోటికి నీరే ప్రకృాతి ప్రసాదించిన గొప్ప సంజీవిని.

– చామర్తి వెంకట రామ కృష్ణ

## చుక్కలు కలపండి



వాత్సాయన



# సరసం విరసం రెండూ లేకుంటే నీరసం

దంపతులు తమ దాంపత్యంలో విసుగుదలను పోగొట్టుకోవాలనుకుంటే వారిద్దరి మధ్యా సరసానికి తగినంత స్పేస్ వుండాలి. కొత్తగా పెళ్లయిన వ్యక్తులు కూడా ఇటీవల, వయసు మీద పడిపోయిన వాళ్లల్లా వ్యవహరిస్తున్నారు. పెళ్లి కాగానే తమకు అంతకు ముందు లేని పెద్దరికం వచ్చేసినట్టుగాను, తామిక చిన్న పిల్లలం కాదు బాధ్యతగా వుండాలి అనే వైఖరితోను వుంటున్నారు. బరువు బాధ్యతలు తీసుకోవడం తపకాదు కానీ అదే పనిగా వాటిగురించి ఆలోచిస్తూ గడపడం వారిలో వున్న చిలిపితనానికి స్వస్తి చెబుతుంది. ఆ చిలిపితనమే వారి దాంపత్య జీవితాన్ని పరిమళభరితం చేస్తుంది. ముఖ్యంగా వారిద్దరి మధ్య లైంగిక విన్యాసాలకు అవరోధమవుతుంది. ఫలితంగా వారిరువురి సెక్స్ జీవితం, ఒక తప్పుని సరి అంశంగా మాత్రమే మిగిలిపోతున్నది. దంపతులు ఏ వయసులో వున్నవారైనా ఎప్పటికీ అమర ప్రేమికులే ! ఈ సంగతిని వారు గుర్తించాలి. వారి మధ్య మధుర భావనలకు వయసు మళ్లదు. ఆ మధుర భావనల్లో సరసం ఎంత ముఖ్యమో విరసం అంటే చిలిపి తగాదాలు కూడా అంతే ముఖ్యం. పెళ్లయి ఇద్దరు పిల్లలు పుట్టేసినా సరే ఇంకా టీనేజీ ప్రేమి కుల్లానే పడక గదిలో వుండగలిగితే అది వారి దాంపత్య జీవితాన్ని ఇంకా ఇంకా మధురం చేస్తుంది. నిరం తరం ఒకే విధమయిన జీవితాన్ని గడిపే భార్యా భర్తలు మధ్య సరస సల్లాపాలు ఒక రిలీఫ్‌ను కలిగిస్తాయి. నవ్యతను అందిస్తాయి. సరసంలో భాగంగా ఒకరినొకరు పొగుడుకోవడం, ఒకరి విషయాలను మరొకరు ఆరాధనా పూర్వకంగా మెచ్చుకోవడం చేస్తే ఒక విధమై న ఆనందం కలుగుతుంది. అలాగే అవుడవుడు పెట్టుకునే గిల్లికజ్జాలు కూడా వారి ఇరువురిని దగ్గర చేస్తుంది. ముఖ్యంగా చెప్పాలంటే, శృతి మించని ఈ తగాదాలు వారిద్దరి మధ్యా నెలకొని వున్న స్తబ్దతను పోగొడతాయి. కోపం నటిస్తూ, వాదులాడుకోవడం, ఒకరినొకరు కసురుకోవడం, ఒకరి నించి ఒకరు తప్పించుకుని పారిపోవాలని ప్రయత్నించడం వారిని పట్టుకోవాలని పరిగెట్టడం, ఈ నేపథ్యంలో కింద మీదా పడడం, పక్కమీద దొర్లడం, ఒకరిపై మరొకరు జోక్స్ వేసుకోవడం లాంటి చేష్టలు వారిని తెలియకుండానే కలుపుతాయి. రతికి అసలైన రంగాన్ని సిద్ధం చేస్తాయి. రతి భాగస్వామ్యంలో ఇలా వ్యవహరించ డాన్ని పాశ్చాత్య సెక్సాలజిస్టులు రోయింగ్ అని అంటారు. రోయింగ్‌లో భార్యభర్తలు తమ తమ లైంగిక అభిరుచులను చెప్పకనే చెబుతారని ఆ భావ వ్యక్తీకరణలో వారిద్దరి నడుమ మనసుకు హత్తుకునే అనుబంధం ఏర్పడుతుందని అంటారు. కబట్టి, ప్రపంచాన్ని మరిచి పోయి దంపతులు పడక గదిలో సరస విరసాలకు తగినంత చోటు కల్పిస్తే వారి సెక్స్ జీవితంలో నీరసం వుండదు.

అంగస్తంభన స్విచ్ వేస్తే టక్కున వెలిగే బల్బులాంటిది కాదు. లైంగికోద్రేక స్థాయి, తీవ్రత కారణంగా అంగస్తంభన ఆధారపడి వుంటుంది. అలాగే స్తంభించిన అంగం, నువు చూస్తున్న నీలిచిత్రాల్లో చూపించినంత ఇదిగా వుండక పోవచ్చు. అంతమాత్రం చేత నీకు స్తంభన లోపాలు వున్నా యని అపోహ పడడం సరికాదు. అంగ స్తంభన విషయంలో నీలిచిత్రాలతో పోల్చుకోవడం కూడా చాలా తప. నీకు లేని పోని సంకోచాలను కలిగిస్తున్న ఆ నీలిచిత్రాలను చూడడం వెంటనే ఆపేయండి. లైంగికోద్రేకం పొందడానికి ప్రత్యా మ్నాయ మార్గాలను ఎంచుకోండి. అంగస్తంభన పూర్తిస్థా యిలో వుండడమనేది మైధునానికి చాలా అవసరం. అంగ ప్రవేశం చేశాక నీకు అంగం మరింత గట్టిపడుతోంది కాబట్టి నీకు ఆ సమస్య లేదు. పూర్వరతి సమయంలో అంగం నిటారుగా కాకపోయినా ఫర్వాలేదు. కాగా కేవలం అం గప్రవేశానంతరమే ఎందుకు అంగం ఎక్కువ గట్టి పడు తోందనేది పూర్తిగా నీ వైయుక్తిక లైంగికత కారణంగా జరు గుతున్న విషయం. బహుశా అంగప్రవేశానంతరం కలిగే యోని స్పర్శ కారణంగానో లేక మైధున కదలికలను నువు పరిపూర్ణంగా ఆస్వాదిస్తుండడం కారణంగానో ఇలా జరుగుతూ వుండవచ్చు. మైధునానికి ఇది చాలా అవసరం కాబ ట్టి నువు చింతించాల్సిన పనిలేదు. ఏ వైద్యున్ని సంప్రదించ నవసరం లేదు. నీకు వున్న స్వాభావిక లక్షణాన్ని నీ భార్యకు తెలియచేయడానికి ప్రయత్నించు. దంపతుల నడుమ సెక్స్ విషయంలో కూడా కమ్యూనికేషన్ చాలా అవసరం. అందు చేత పూర్వరతి సమయంలో సరిగా స్తంభించని అంగాన్ని చూపించడానికో లేక ఆమె చూపించడానికి అంగీకరించ పోవడానికో సంకోచించనక్కరలేదు. సెక్స్ చేస్తున్నవుడు ఎట్లాంటి ఇబ్బందీ లేదు కాబట్టి అంగాన్ని చూపించడానికి నువు ఎందుకు సందేహిస్తున్నావో తెలియక నీ భార్య అపోహ పడవచ్చు. కాబట్టి ఆమెతో సిగ్గు బిడియాలను విడిచిపెట్టి, సంభాషించు.

# వాస్తు గురించి ముఖ్యమైన లక్షణాలు

సాధారణంగా ఇంటికి నాలుగు దిక్కులా కొంత ఖాళీ స్థలాన్ని వదిలి, ప్రహరీ గోడ నిర్మించాలి. ఈశాన్యానికి ఎదురుగా ఉండేదే నైరుతి. ఇతర మూలల కంటే నైరుతి మూలలో ఖాళీ స్థలం మెరకగా ఉండాలి. నైరుతిలో బావి లేదా సంపు బొత్తిగా ఉండకూడదు. గొయ్యి కానీ పల్లంగా కానీ ఉండకూడదు. కొంత ఎత్తుకు లేపి మెరకగా ఉండేట్లు చూసుకోవాలి.

పల్లెటూళ్లలో ఇప్పటికీ నైరుతిలో చుట్టిల్లు వేస్తూ ఉంటారు. ఇలా వేయడం అన్నివిధాలా శ్రేయస్కరం. ఈ ఆధునిక యుగంలో చుట్టిల్లు వేసుకోవడం చాలామందికి రుచించక పోవచ్చు. చుట్టిల్లు ఓల్డ్ ఫాషన్ అనిపించవచ్చు. అప్పుడు నైరుతిలో ఒక అవుట్ హవుజ్ కట్టించుకోవచ్చు. అంత శక్తి లేదు అనుకుంటే కనీసం గది అయినా నిర్మించుకోగల్గితే మంచిది. అలా కూడా కుదరని పక్షంలో స్థలాన్ని బాగా మెరక చేసి ఉంచాలి. బయటివైపు ఇతర మూలలతో పోలిస్తే నైరుతి వైపున మెరకగా ఉండాలన్నాం కదా! అదేవిధంగా ఇంటి లోపలివైపు నైరుతిలో బరువు ఉండాలి. అంటే ఆగ్నేయం, వాయవ్యం, ఈశాన్యం దిక్కులకన్నా ఎక్కువ బరువు ఉండాలి. నైరుతివైపున బీర్వా, బుక్ ర్యాక్, బోషాణం లాంటి బరువైన సామగ్రి ఉంచాలి.

★ మనం ఉన్న ఇంటి వాకిలి దక్షిణం వైపు ఉండకూడదు, ఉత్తరంవైపు ఉండాలి. పూజామందిరం తూర్పువైపు ఉండకూడదు ఈశాన్యం వైపు ఉండాలి. అంతేకాకుండా బీరువా వంటివి తూర్పువాకిలి వైపు తిరిగి ఉండకూడదు. పడమరవైపు వాకిలి ఉండాలి.

★ ఇల్లు అద్దెకు ఏ భాగంలో ఇచ్చుకోవచ్చు.

సాధారణంగా మనం వాడుకునే ఇంట్లో ఏ భాగం కూడా అద్దెకు ఇవ్వకూడదు.

కాదుకూడదు అనుకున్నవుడు మనం తూర్పు, ఉత్తర భాగాలు, నైరుతి, ఈశాన్యాలు ఉండి, వాయవ్యం గది లేదా ఆగ్నేయం గదిని అద్దెకు ఇచ్చుకోవచ్చు. ఇవన్నీ కూడ మనం ఉంటున్న ఇంటి నిర్మాణాన్ని బట్టి నిర్ణయం తిసుకోవాలి. మిగతా అన్ని ఇళ్లకు ఇలా ఇచ్చుకునే వీలు ఉండదు.

★ నైరుతిలో ముఖ్యంగా బాత్‌రూమ్స్ ఉండవచ్చా..

ఎక్కువగా మన దేశానికి ఎల్లప్పుడు ఈశాన్యనైరుతి రుతుపవనాలే వస్తూ ఉంటాయి. వీటికి ఎదురుగా లెట్రిన్ గదులు ఉండటం మంచిది కాదు.ఒకవేళ ఉంటే నైరుతి రుతుపవనాల కారణంగా ఆ గాలులతో పాటు బాత్‌రూమ్స్‌లోని చేదు వాసనంత ఇల్లంతటికీ వ్యాపిస్తుంది. అలాగే, ఈశాన్యంలోనూ అంతే ఒకరు చెప్పారని కాదు, వాస్తు ప్రతీ అంశంలోనూ ఆరోగ్యంతో, జీవితంతో ముడిపడి ఉంటుంది. నైరుతిలో లెట్రిన్ రావటం మూలంగా ఆరోగ్య విషయంతో పాటు ఆ దిశలో ప్రధాన పడక రాదు. అలాగే, నైరుతిలో చిన్న గది వస్తుంది, అది వాస్తు విరుద్ధం.

★ వాస్తు ప్రకారం వంటగదికి, పూజ గదికి ఆనుకుని టాయిలెట్స్ ఉండకూడదంటారు. అయినా ఫరవాలేదు అంటూ ఈ రోజుల్లో, ఇలా కూడా కట్టుకుంటున్నారు. గోడకు ఒక ప్రక్కన టాయిలెట్, రెండో ప్రక్కన వంటగది లేక పూజ గది ఉండటం ఆరోగ్యరీత్యా మంచిది కాదు.

★ ఈ రోజుల్లో గదిగదికీ టాయిలెట్స్, వాష్ బేసిన్స్ కడుతున్నారు. ఇలా కట్టటం చాలా అనారోగ్యకరం. కొన్ని అపార్ట్మెంట్స్‌లో 5లేక6 అంతస్తు వారికి కూడా చెదలు, ఇంటిలోపలికి కాలుజెర్రులు వంటివి రావటం జరుగు తుంది. భూమికి అంత ఎత్తులో కూడా ఇవన్నీ ఎలా వస్తాయంటే, డ్రైనేజ్ పైపుల వల్ల ఇలాంటి సమస్యలు వస్తుంటాయి. అందువల్ల టాయిలెట్స్ బయట బాల్కనీలో ఏర్పాటు చేసుకుంటే, కొంతయినా రక్షణ కలుగుతుంది.

★ ఇంటి స్థలాల తూర్పు భాగం పల్లంగా ఉండాలి. స్థలంలో తూర్పుభాగం ఎత్తుగా ఉంటే ఇంట్లో ఆడపెత్త నం ప్రబలంగా వుంటుంది. ఆగ్నేయ భాగం ఎత్తుగా ఉంటే ఇంట్లో ఆడవారి పెత్తనం ప్రబలంగా వుంటుంది. ధన హాని తప్పదని వాస్తు శాస్త్రం అంటోంది.

## జాతకం

# మేషరాశి-లక్షణాలు

వీరు మధ్య దేహం గలవారై బక్కపలచగా నుందురు. విశాలమగు ముఖము, పొడవైన మెడ, బిరుసు వెంట్రుకులు కల్గియుందురు. సన్నని చుబుకము కల్గియుందరు. ఒత్తగు కనుబోమ్మలు, కొద్ది పసుపు రంగు కండ్లు కలిగి విశితమగు దృష్టి కలిగి యుందురు. వీరికి ప్రాణశక్తి ఓజస్సు తగినంతగా నుండును. వీరు సాధారణముగా శిరోసంబంధమైన అనారోగ్యములుగాని, ఉదరసంబంధమైన అనారోగ్యములుగాని కల్గియుందురు. వీరి శరీరమునందు కఱ్ఱ, కత్తి, అగ్ని మొదలగువానిచే తగిలిన దెబ్బలకు సంబంధించిన గుర్తులుండును. వీరికి ఓరిమి తక్కువగా నుండును. తరచు ఆలోచనల వలన నిద్ర సరిగి పట్టదు. శిరస్సు, ముఖ ము మొదలగు ప్రదేశములందు కరుపులు మొదలగువానికి సంబంధించిన గర్తులుం డును. చర్మ సంబంధమైన అనారోగ్యములకు అవకాము న్నది. శరీరము ఉష్ణతత్త్వము కలిగి తరచుగా వేడిగా ఉండును. శారీరకమగు శక్తి అధికముగా నుండును. ప్రతి పనియందు చొర వ కలిగి యుందురు. ప్రతి విషయమునందు ఆసక్తి కనబరచెదరు. ఉత్సాహంతో మెలగెదరు. స్వాతంత్ర్యాభిలాష అధికముగా నుండుట వలన ఇతరులకు మూర్ఖత్వముగా భాసిం చును. శరీరము సన్నగా నున్నప్పటికినీ పుష్టి కలిగి శక్తివంతమై యుందురు. ధైర్యము అధికముగా నున్నందు వలన ప్రతిపనిని ముందు వెనుకలాలోచింపక ఆకస్మికముగా ప్రారంభిం చెదరు. అత్యాశ వలన శ్రమకు మించిన ఫలితము నాశించి, ఆశించిన ప్రయోజనము సిద్ధిం పక వ్యాకులపడెదరు. మనస్సు నిలకడగా నుం డక చంచలమై ఏకాగ్రత కోల్పోయినందు వలన ప్రారంభించిన పనులకు కొన్నింటిని మధ్యలోనే విడిచి నష్టపోవుదురు. అందుచే వీరు అరంభించిన పని పూర్తి చేయుటయందు పట్టుదల కలిగి యుండవలెను.

వీరికి తెలివితేటలు అధికముగా యుండును. ఎదుటివారిలోని దోషములను సులభముగా గుర్తించగలిగి యుందురు. ఆ లక్షణము వలన విరోధములు ఏర్పడుచుందును. తగాదాలకు వీరు వెనుదీయరు. కోపము వీరికి అతిశీఘ్రముగా వచ్చును. సహనము తక్కువయగుట వలన ఎదుటివారి అధిపత్యమును అంగీకరింపలేరు. కొన్ని సమయములలో యుక్తాయుక్తములను ఆలోచింపకయే ఒడిదుడుకు తనముతో సాహసించి ప్రవర్తించెదరు. వీరి ఆలోచన ఒక క్రమంలో పెట్టుకొనినచో అధికముగా విజయములను సాధింపగలరు. దుష్టులతో సహవాసము వలన వీరు కొన్ని నష్టములను ఎదుర్కొనవలసి వచ్చును. వీరు తమ శక్తిని ఒకే లక్ష్యముపై కేంద్రీకరించుట వలన సత్ఫలితములను సాధించగలరు. వీరు మనస్సును, వాక్కును నియంత్రించుకొనవలసి యుండును. నిర్భయముగా ఉన్నందున్నట్టు ఎదుటివారితో మాట లాడగలరు. లాభనష్టాలతో సంబంధం లేకుండ ధైర్యంగా కార్యరంగంలోకి దూకి ఉద్రేకముతో పనిని చేయుచుందురు. వీరిలో దాతృత్వమున్నను, ఎదుటివారి వలన తమకు ఉపకారముంటేనే వారికి ఉపకరింతురు. వీరి ఖర్చు దుబారాగా ఉండును. వీరి ఏకాగ్రంగా ఆలోచించిన సందర్భాలలో క్రొత్త క్రొత్త విషయములు స్ఫురించుచుండును. ఇతరుల అభివృద్ధిని చూచినపుడు వారిని అతిక్రమించాలను పట్టుదల కల్గియుందురు. గాని మరియెక కార్యమునందు అసక్తులెనపుడు ఇదివరలో ప్రారంభించిన కృషిని వదలి వేయుదురు. వీరికి రవి గురులు శుభులు, బుధ, శుక్ర, శనులు దోషులు. వీరి ఏ విషయమునైనను త్వరితముగా గ్రహింపగలరు. అట్లే త్వరితముగా తమ అభిప్రాయములను మార్చుకొనుచుందురు. హక్కులకై పోరాడే లక్షణము కలిగి యున్నందు వలన పలువువు వీరి నాయకత్వమును కోరుచుందురు. రాజకీయములందు వీరికి అభిలాష ఉండును. ఎవరితోడనైనను సంభాషించునపుడు తామే అధికముగాఉ మాటలాడుచుందురు. ఏ విషయమునైనను వెంటనే తేర్చి నిర్ణయమును నిష్కర్షగా చెప్పెదరు. నిగూఢవిషయమును గూడ కనిపెట్టగల నేర్పు వీరికుండును. వీరి పనిచేయుటకంటే చేయించుటయందు దక్షత కలిగి వ్యవహరించెదరు. వీరికి చిన్నతనమున కష్టములున్ననను, రానురాను సుఖానుభవములు పెరుగును. వీరికి ఆలోచన కంటె స్వేచ్ఛ అధికముగా ఇష్టమగును. తమ మనస్సునకు న్యాయమని తోచిన ఏ కార్యమునైనను సమర్థింతురు. ఏ పనిలోనైనను ఉన్నతస్థితిని సంపాదించుట యందు కాంక్ష గలిగి కృషి చేసెదరు. వీరి పట్టుదల యొక్క స్వభావము తన చుట్టూ ఉన్న వారిని అతిక్రమించాలనే కాంక్షతో ముడిపడి యుండును. గాన ఏ కార్యములోనైనను విజయం సంభవింపవలెనన్న వీరికి పోటీ అవసరమని తోచుచున్నది. విద్య మొదలగు విషయములలో ఈ పోటీ తత్త్వము వీరి విజయమునకు కారణమగును.

వీరు పట్టుదలకు ప్రాముఖ్యమిచ్చి, ఆలోచనకు తక్కువ ప్రాముఖ్యమిచ్చి అనవసరపు ఖర్చులు చేయుటకు గూడ వెనుకాడక నష్టపోవుచుందురు. ఎదుటివారి కష్టములకు కరిగి వారికి ఉపకారము చేయుదురు.

మీ సందేహాలని క్లుప్తంగా
(మనిషికి 1 ప్రశ్న మాత్రమే) ఈ క్రింది వివరాలు వ్రాసి పంపండి. (పుట్టిన తేదీ వివరాలు లేనివారు 108 లోగా ఒక సంఖ్య వ్రాసి పంపండి. ఇది ప్రశ్న పద్ధతి, మనిషికి ఒక్క ప్రశ్న మాత్రమే)

పేరు : ......................................

పుట్టిన తేదీ : ......................................

పుట్టిన సమయం : ..............................

పుట్టిన ఊరు (మండలం) : ...................

ప్రశ్న : ......................................

పై వివరాలతో కూడిన లెటర్‌ను ఈ క్రింది అడ్రస్‌కు పంపండి...

'జాతకం' 'సూర్య' ఆదివారం

**SPR publications, Surya Soudha,
Plot.No: 185, M.C.H. NO.258/1/185,
siddi vinayaka nagar,
AyyappaSociety Opp: Hi-Tech City,
Hyderabad - 500 072.**

## 13-11-2016 నుండి 19-11-2016 రాశిఫలం



**మేషం: Aries** ( అశ్విని, భరణి, కృత్తిక - 1) :
భార్య మూలంగా ధనలాభం. ఋణములు వసూలు అగును. కులాంతర వివాహం గాని, అన్య స్త్రీలతో పరిచయం గాని కలుగును. పిల్లల నుండి సహకారం లభిస్తుంది. ఆదాయం పెరుగుతుంది. చిరకాలంగా వేధిస్తున్న సమస్యలు పరిష్కారం అవుతాయి.



**వృషభం: Taurus** (కృత్తిక - 2,3,4, రోహిణి, మృగశిర - 1,2):
తండ్రి ద్వారా ఆర్థిక సహాయం లభిస్తుంది. పుణ్యక్షేత్రాలను సందర్శిస్తారు. స్థిరాస్తులు విలువ పెరుగుతుంది. ఋణ ప్రయత్నాలు ఫలిస్తాయి. కోర్టు గొడవల్లో ఇరుక్కునే అవకాశం ఉంది. మీకు సంబంధం లేని వ్యక్తులు ఈ పై నిందలు వేయడానికి ప్రయత్నం చేస్తారు.



**మిధునం: Gemini** (మృగశిర -3,4
శుభకార్యములు కొరకు పిల్లల చదువు కొరకు పెద్ద మొత్తం ఋణం ఖర్చు చేయవలసి వస్తుంది. ముఖ్యమైన నిర్ణయాలు చేయవలసినపుడు ఇతరులు సలహాలు తీసుకోవడం మంచిది. వృత్తిలో ఇతరుల జోక్యం ఎక్కువ అవుతుంది. భార్యకు అనారోగ్యం కలుగును.



**కర్కాటకం: Cancer**(పునర్వసు -4,
అనవసర ప్రయాణముల వలన ధనం, కాలం నష్టమగును. దూరప్రాంతాలలో నివసించవలసి వచ్చును. భూమికి సంబంధించిన వ్యవహారములలో లాభం, ఆకస్మిక ప్రమాదములు జరుగవచ్చును. ఋణ ప్రయత్నాలు ఫలించిన శుభకార్యములలో పాల్గొంటారు. శుభవార్తలు వింటారు.



**సింహం: Leo** (ముఖ, పుబ్బ, ఉత్తర -1)
మధ్యవర్తుల సహాయంతో కొన్ని పనులు పూర్తి చేసుకుంటారు. క్రీడాకారులు పోటీలలో విజయం సాధిస్తారు. సినిమారంగంలోని వారికి మంచి అవకాశములు వస్తాయి. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. ఋణముల నుండి విముక్తి లభిస్తుంది.



**కన్య: Virgo** ( ఉత్తర - 2,3,4, హస్త, చిత్త -1,2)
:పేరు ప్రతిష్టలకు భంగం కలుగును. ఉద్యోగస్థులకు రావలసిన ప్రమోషన్లు ఆగిపోవును. ముఖ్యమైన విషయాలలో అనుభవజ్ఞుల సలహాలు తీసుకోవడం మంచిది. కోర్టు వ్యవహారములు వాయిదా కోరడం మంచిది. ఇతరులకిచ్చిన మాట తప్ప వలసి వస్తుంది.



**తుల: Libra** (చిత్త -3,4, స్వాతి, విశాఖ -1,2,3)
పీడకలలు వస్తాయి. ప్రేమ వ్యవహారలములకు అవరోధములు, గృహంలో సుఖం లేకపోవుట, అకాల భోజనము, ప్రయాణములు యందు విఘ్నం, నిద్రపట్టక పోవుట. క్రీడాకారులు పోటీలలో విజయం సాధిస్తారు. నిరుద్యోగులకు నూతన ఉద్యోగ అవకాశములు వస్తాయి.



**వృశ్చికం: Scorpio** (విశాఖ -4 అనూరాధ, జ్యేష్ఠ)
రహస్య సమావేశాలు జరుపుతారు. అధికారంలో ఉన్న స్త్రీలు సహాయపడతారు. కోర్టు సమస్యలు పరిష్కారం అగును. బంధువుల వివాహమునకు ఆర్థిక సహాయం చేయవలసి వస్తుంది. విద్యార్థులు, నిరుద్యోగులు పోటీ పరీక్షలలో విజయం సాధిస్తారు. విదేశ ప్రయాణ ప్రయత్నాలు నెరవేరును.



**ధనుస్సు: Sagittarius** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ -1)
వృత్తి నిందలు వస్తాయి. అక్రమ ఆదాయం లభిస్తుంది. ప్రేమికుల మధ్య ఎడబాటు వస్తుంది. విద్యావంతురాలైన స్త్రీతో పరిచయం అవుతుంది. నిరుద్యోగులకు ఉద్యోగం వస్తుంది. విద్యార్థుల పరీక్షలలో మంచి ఫలితాలు సాధిస్తారు. గృహ నిర్మాణం చేస్తారు. ఋణ ప్రయత్నాలు ఫలిస్తాయి.



**మకరం: Capricorn** (ఉత్తరాషాఢ -2,3,4, శ్రవణం, ధనిష్ఠ -1,2):
బంధుమిత్రులకు విందు పేరుతో ఎక్కువ ధనం ఖర్చు చేస్తారు. మీ కుటుంబంలో ఒకరికి మంచి ఉద్యోగం వస్తుంది. వివాహ సంబంధములు నిశ్చయం అగును. స్థిరాస్థులపై ఆదాయం లభిస్తుంది. భార్యభర్తల మధ్య ఉన్న విభేదములు తొలగిపోతాయి. విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు వస్తాయి.



**కుంభం: Aquarius** (ధనిష్ఠ-3,4, శతభిష, పూర్వాభాద్ర- 1,2,3
కొత్త పనులు ప్రారంభించుటకు అనుకూలం కాదు. ప్రభుత్వ వ్యవహారాలలో జాగ్రత్తగా వ్యవహరించవలసి ఉన్నది. కుటుంబ కలహాములు ఎక్కువగా ఉంటాయి. స్థిరాస్థులు విలువ పెరిగి వాటిపై ఆదాయం లభిస్తుంది. సౌకర్యములు కొరకు ఖరీదైన వస్తువులు కొంటారు.



**మీనం: Pisces** (పూర్వాభాద్ర -4,
పితృవిరోధం, తండ్రికి అనారోగ్యం, నూతన వస్త్రములు బంధువులకు కానుకగా ఇస్తారు. బాధ్యతలు పెరుగుతాయి. స్త్రీకి సంబంధించిన వ్యవహారములలో ఖర్చులు ఎక్కువగా ఉంటాయి. సకాలంలో రావలసిన ధనం చేతికి అందుట వలన మీ అవసరములు తీరుతాయి.



నిద్రపోయి కలగన్నాను బ్రతుకంతా సుందరమని. మేలుకొని కనుగొన్నాను బ్రతుకు పెద్ద బాధ్యత అని. -గొథె

## ఆలయం

తూర్పు గోదావరి జిల్లాలో వశిష్ఠానదీ తీరాన ఈ అప్పనపల్లి గ్రామం ఉంది. ఇక్కడ ప్రవహించు అంతర్వాహిని గోదావరీనది వశిష్ఠుని పేరుమీద పవిత్రమైన గోదావరిగా ప్రసిద్ధిచెందింది. గతంలో ఈ నదీ తీరాన ఆశ్రమం నిర్మించుకుని చాలా మంది ఋషులు తపస్సుచేశారట. అప్పన్న అనే ఋషి తపస్సు చేసిన ప్రదేశం అయినందున అప్పనపల్లిగా పిలువబడింది.



# కోనసీమలో మరో తిరుపతి

గోదావరి నదీతీరానవున్న అప్పనపల్లి గ్రామం సహజ ప్రకృతిసౌందర్యంతో విరాజిల్లుతూ కనిపిస్తుంది. కొబ్బరి, పనస, మామిడి తోటలు, ఒకవైపు సముద్రం, ప్రశాంతమైన, స్వచ్ఛమైన వాతావరణం కలిగిన పరిసరాలు....యాత్రికులకు మానసికోల్లాసాన్నిస్తాయి.

**భక్తుని కలలో...**

గ్రామంలో నివశించే మొల్లేటి రామస్వామి అనే భక్తుడు కొబ్బరి వ్యాపారం చేస్తూ జీవనం సాగించేవాడు. 1966వ సంవత్సరంలో ఒక రోజు రామస్వామికి శ్రీ వేంకటేశ్వర స్వామి కలలో కనిపించి– "నా దర్శనం కోసం భక్తులు ఎంతో శ్రమకోర్చి తిరుమలకు వస్తున్నారు. వారి సౌకర్యార్థం నేనిక్కడే, నీ కొబ్బరి దుకాణంలోనే తూర్పు దిక్కున



వెలిశాను." అని చెప్పగా రామస్వామి ఉదయాన్నే గ్రామస్తులకు ఈ విషయం చెప్పి వారిని వెంటతీసుకుని స్వామివారు చెప్పిన ప్రదేశంలో వెదకగా విగ్రహం లభించింది. ఆ విధంగా వెలసిన భగవానుడు శ్రీబాలబాలాజీగా భక్తులచేత పిలువబడుతూ పూజలు అందుకుంటున్నాడు.

ఆలయ ధర్మకర్త శ్రీరామస్వామి ఆ ప్రదేశంలో ఆలయం నిర్మించాక భక్తులకు ఉచిత భోజన వసతులు కల్పించి శ్రీ స్వామి వారి సేవకు అంకితం అయ్యారు. కొత్తగా నిర్మించిన ఆలయంలో 4-7-91న పంచాహ్నిక ఆగమశాస్త్ర విధులతో శ్రీశ్రీశ్రీ త్రిదిండి శ్రీమన్నారాయణ చినజీయర్ స్వామివారు శ్రీబాలబాలాజీ స్వామివారిని జ్యేష్ఠ శుద్ధ దశమినాడు ప్రతిష్ఠించారు. ఈ ఆలయం ఎంతో కళాత్మకతను నింపుకున్న సుందర కట్టడం. గోపురంపైనా, గర్భాలయంలోను కనిపించే చిత్రాలు భక్తులను ఎంతగానో ఆకట్టుకుంటాయి.

అప్పనపల్లి క్షేత్రం ఎంతో పవిత్రపుణ్యస్థలంగా కీర్తికెక్కింది. భక్తులు తండోపతండాలుగా వచ్చి శ్రీబాలబాలాజీస్వామిని దర్శించుకుంటారు. దేవాదాయశాఖఆధ్వర్యంలో ఆలయం మరింత అభివృద్ధి చెందింది. నిత్య ధూపదీపనైవేద్యాలతో, సంకల్ప పూజావిధానాలతో ఇక్కడ స్వామివారు విరాజిల్లుతున్నారు. ఈ పుణ్యక్షేత్రం పవిత్ర వశిష్టాగోదావరితీరంలో వుండడంతో మరింత ప్రాధాన్యతను సంతరించుకున్నది.

**పూర్వచరిత్ర ...**

ఈ వశిష్ఠానదీ తీరంలో ఎందరో మహానుభావులు భక్తితో భగవానుని పూజించి, వేదాలను, ఇతిహాసాల సారం గ్రహించి సిద్దులుగా మారినట్లు ఇక్కడి స్థలపురాణకథవల్ల తెలుస్తోంది.

**ఎలా వెళ్లాలి...**

హైదరాబాద్‌నుండి వెళ్ళేవారు కాకినాడ, నర్సాపురంవరకు రైలు, లేదా బస్సులో వెళ్లవచ్చు. కాకినాడకు(వయా యానాం) 70 కి.మీ దూరాన, రాజమండ్రికి 85 కి.మీ.దూరాన, నర్సాపురానికి 38 కి.మీ దూరాన ఈ అప్పనపల్లి గ్రామం వుంది. మండల కేంద్రమైన మామిడి కుదురు నుండి బస్సు లేదా టాక్సీలో వెళ్ళవచ్చు.

మన రాష్ట్రంలోని ప్రసిద్ధ ఆలయాలలో ఒకటిగా, కోనసీమలో రెండవ తిరుపతిగా అప్పనపల్లి క్షేత్రం ప్రసిద్ధికెక్కింది.






ఉగాది మనకు చాలా పెద్ద పండుగ. మనకు ఇంగ్లీష్ క్యాలెండర్లు వచ్చినా, వాటినే మనం ఇప్పుడు ఫాలో అవుతున్నప్పటికీ మనం ఉగాదినే సంవత్సరాదిగా పరిగణిస్తాం. ఈ సమయం చాలా అద్భుతమైనది. ప్రకృతిలో కొత్తజీవం పోసుకుంటుంది. ఆకులు చిగురిస్తాయి,కొత్త పూత విరబూస్తుంది. అంతా కొత్తగా, ఆహ్లాదకరంగా గోచరిస్తుంది.

కోకిల ఉత్సాహంగా గానం చేస్తుంది. అంతటా ఆనం దం... ప్రకృతి అంతా పులకింతలతో ఆనందాన్ని పం చుతుంది. ఇదంతా ఎందుకు జరుగుతుంది. ఉగాదికి ఈ తతంగమంతా ఏంటి? అనే

# ఆత్మ సాక్షాత్కారానికి ఆది ఉగాది

సందేహం కలుగవచ్చు. మనం తిరిగే నేలను,తాగే నీటిని, పీల్చే గాలిని, పూజించే అగ్నిని, ఆలోచనలతో ఆకాశాన్ని అనునిత్యం కలుషితం చేస్తూనే వున్నాము. పంచభూతాలు కూడా మానవ ఆలోచనలను, చెడు కర్మలను అనునిత్యం గ్రహిస్తూ ఆ భారాన్ని మోసి మనం నాశనమవకుండా జీవం నిలబడటానికి సాయం చేస్తున్నాయి. మానవ శక్తి దేన్నైనా ప్రభావితం చేయగలదు, అలా ప్రభావితమైన పంచభూతాలు ప్రకృతి రీత్యా ఒకానొక సమయంలో శుద్ధి గావించబడుతాయి. అలా మన దగ్గర శుద్ధి కావించబడే సమయమే ఉగాది. అందుకే అంతటా కొత్తదనం



గోచరిస్తుంది.

చెట్లు చిగురిస్తుంటాయి,పక్షులు కిలకిల రావాలు చేస్తుంటాయి. పంచభూతాలు శుద్ధగావించబడుతున్న సమయంలో పంచభూతాత్మకమైన మన శరీరం కూడా అందుకు సిద్ధమవుతుంది. దౌర్భాగ్యమేమిటంటే అందుకు మనం సిద్దంగా లేము. కేవలం పిండి వంటలు చేసుకుని కొత్త బట్టలు వేసుకునే వరకే మన పండుగ. అంతకు మించి ఇంకే ప్రాధాన్యత ఆపండుగకు లేకుండా పోతుంది. కొన్ని వేల సంవత్సరాల క్రితమే ప్రకృతిలో వచ్చే మార్పులను గుర్తించి ఆయా కాలాలకు అనుగుణంగా పండుగలను నిర్ణయించారు. ఉగాది రోజు జీవం అంతకు ముందు పట్టిన జాడ్యాలను వదిలించుకుని కొత్తగా చైతన్యాన్ని నింపుకునేందుకు నిర్దేశించిన పండుగ. చెట్టు ఆకులు చిగురించినట్టే మనలో ఆనందం చిగురిస్తుంది. కోకిల పాటలు పాడినట్టే మన ఆత్మ ఆనంద తాండవం చేస్తుంది. ఇదే ఆనందంతో ఇదే ఉత్సాహం ఎప్పటికీ వుండాలని ఉగాదిని సంవత్సరాదిగా చేసి మిగిలిన కాలమంతా ఆనందోత్సాహాలతో గడిపే విధంగా మన ఋషులు ఏర్పాట్లు చేసారు. ఈ ఉగాది రోజు యాక్టివేట్ అయిన ఎనర్జీ సిస్టమ్‌ని మధ్య మధ్యలో వివిధ పండుగల ద్వారా కదిలిస్తూ మరి కొంత శక్తిని నింపుతారు. సంసారి కూడా తన సంసార సాగరాన్ని ఈదుతూ కూడా ,కేవలం మన పండుగలను సవ్యంగా శాస్త్రప్రకారం జరుపుకున్నా మోక్షం సాధించే విధంగా మన పండుగలను నిర్దేశించారు ఋషులు.

మనం ప్రస్తుతం ఎక్కువగా ఉపయోగిస్తున్న ఇంగ్లీషు క్యాలెండర్ చాలా స్వల్పస్థాయి సామర్థ్యం కలిగినది. మన పంచాంగం కొన్ని లక్షల సంవత్సరాల తరువాత ఖగోళంలో జరిగే మార్పుల గురించి కూడా ముందుగా చెప్పగలిగే సామర్థ్యం వున్న క్యాలెండర్. పంచాంగాన్ని మించిన క్యాలెండర్ ఈ భూమి మీద ఇప్పటివరకు రాలేదంటే అతి శయోక్తి కాదు. ఈ పంచాంగం ప్రకారం ఏడాది అనేది ఉగాది రోజే ప్రారంభం అవుతుంది. ఈ క్యాలండర్ పరంగా ఇప్పుడు మనం కొత్త సంవత్సరంలోకి అడుగిడుతున్నాము. భారతీయ క్యాలండర్ ప్రకారం కొత్త సంవత్సరం మొదటి రోజును ఉగాది అంటాము. ఇప్పుడు భూమి సూర్యునికి అతి సమీపంలో ఉన్నది. ఎదగటానికి వేసవి అత్యంత అనుకూలమైనది. వృక్షజాతి అంతా వేసవిలోనే బాగా పెరుగుతుంది. ఎందుకంటే వాటి పెరుగుదలకి అవసరమైన కిరణజన్య సంయోగక్రియ ఈ సమయంలో బాగా జరుగుతుంది. కానీ భూమిపై ఉండవలసిన వాటినన్నిటినీ మనం నాశనం చేశాము కాబట్టి, ప్రస్తుతం వేసవి అంటే అత్యంత అసౌకర్యమైన కాలంగా మారింది. అసలు వేసవి అంటే ఎడారులలో మాత్రమే అసౌకర్యంగా ఉండాలి. మిగతా భూమి మీద జీవనం ఎంతో ఉన్నత స్థాయిలో, ఉత్సాహంగా జరగవలసిన సమయమిది.

ఎరుక(అవేర్నెస్)తో ఉంటే ఈ సమయమే మానవులకు కూడా ఎంతో మంచిది. మీ చుట్టూ ఉన్న జీవనం ఉరకలేస్తూ ఉంటుంది. అందువల్ల మి మ్మల్ని మీరు మీకు కావలసిన విధంగా మలచుకోవడానికి కూడా ఇదే ఉత్తమమైన సమయం. ఇది ఉత్తరాయణ కాలం కూడా. అంటే భూమి పరంగా చూస్తే సూర్య గమనం ఉత్తరం వైపు ఉంటుంది. ఉత్తరా ర్ధగో ళంలో ఉన్న మనకు ఈ సమయం ఎంతో ముఖ్యమైనది

ఆత్మ సాక్షాత్కారానికి, ఆశయ సాధనకు అనువైన సమయం ఇదే!



నిరంతరం త్రాగేవాడు రుచి చూడడు. అలాగే ఎల్లప్పుడూ మాట్లాడేవాడు ఆలోచించడు.-మాథ్యూ ప్రీయర్











# వావ్! వహ్‌వా క్యాండిల్ హవా





కొవ్వు కరిగిస్తాం...కాంతి రప్పిస్తాం
కటిక చీకట్లను పారద్రోలతాం..
కొండంత అండగా ఉంటాం...
కష్టపడే మనస్తత్వం...కనికరించమంటున్నాం...
కరుణామయుని కృపాపాత్రులం...
కాలగర్భంలో ప్రతినిత్యం కలిసిపోతాం...
కళారూపంగా మలిచినా...
కరగిపోవడమే మా ధర్మం











మోహన్ వారి

# శ్రీకేదారేశ్వరవ్రతం




ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక
విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం – 533 101.
Mohanpublications.com

# కేదారేశ్వర వ్రతము

శ్రీ మహాగణాధిపతయే నమః

ఆచమ్య! ఆచమనంచేసి గణపతిని ప్రార్థించి, విజయ శ్లోక సప్త శ్లోకాన్ని పఠించి భూతోచ్ఛాటనముగావించి ప్రాణాయామంచేసి సంకల్పమును చెప్పుకొనవలయును. సంకల్ప మందలి మూడవభాగము ఈ క్రింది విధముగా మార్చి చెప్పుకొనవలయును.

వర్షేవర్షేప్రయుక్తాం కేదారేశ్వర దేవతాముద్దిస్య కేదారేశ్వర దేవతా ప్రీత్యర్థం స్కాంద పురాణోక్త కల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యేః

**అనిచెప్పి పంచపాత్రయందలి నీరుతాకవలయును. తరువాత గణపతి పూజచేసి అవన నివేదనము చెల్లించి కలశపూజ, ప్రాణప్రతిష్టలు గావించి పూజను ప్రారంభించవలయును.**

## కేదారేశ్వరపూజా ప్రారంభము

శ్లో॥ శూలం డమరుకం చైవ దధానంహస్తయుగ్మకే
కేదారదేశమీశానం ధ్యాయే త్రిపురఘాతినమ్. ॥శ్రీ కేదారేశ్వర ధ్యాయామి॥

శ్లో॥ కైలాసశిఖరే రమ్యే పార్వత్యా సహితప్రభో
అగచ్ఛ దేవదేవేశ మద్భక్త్యా చన్ద్రశేఖర కేదారేశ్వరమావాహయామి.

శ్లో॥ సురాసురశిరోరత్న ప్రదీపితపదామ్బుజ
కేదారదేవ మద్దత్తమాసనం ప్రతిగృహ్యతామ్.
కేదారేశ్వరాయ నమః ఆసనం సమర్పయామి

శ్లో॥ గంగాధర నమస్తేస్తు త్రిలోచన వృషధ్వజ
మౌక్తికాసనసంస్థాయ కేదారాయ నమోనమః
శ్రీ కేదారేశ్వరాయ నమః పాద్యం సమర్పయామి

శ్లో॥ అర్ఘ్యం గృహాణ భగవన్ భక్త్యా దత్తం మయేశ్వర
ప్రయచ్ఛ మే మనస్తుష్టిం భక్తానామిష్టదాయకం
శ్రీ కేదారేశ్వరాయ నమః అర్ఘ్యం సమర్పయామి

శ్లో॥ మునిభిర్నారదప్రఖ్యైర్నిత్యమాఖ్యాతవైభవ
కేదారదేవ భగవన్ గృహాణాచమనం విభో
శ్రీ కేదారేశ్వరాయ నమః ఆచమనీయం సమర్పయామి

శ్లో॥ స్నానం పఞ్చామృతైర్దేవ శ్రితం శుద్ధోదకైరపి
గృహాణ గౌరీరమణ త్వద్భక్తేన మయార్పితమ్.
శ్రీ కేదారేశ్వరాయ నమః పంచామృతస్నానం సమర్పయామి

శ్లో॥ నదీజలం సమాయుక్తం మయాదత్తమనుత్తమం
స్నానం స్వీకురు దేవేశ సదాశివ నమోస్తుతే
శ్రీ కేదారేశ్వరాయ నమః స్నానం సమర్పయామి

శ్లో॥ వస్త్రయుగ్మం సదా శుభ్రం మనోహరమిదం శుభం
దదామి దేవదేవేశ భక్త్యేదం ప్రతిగృహ్యతామ్.
శ్రీ కేదారేశ్వరాయ నమః వస్త్రయుగ్మం సమర్పయామి

శ్లో॥ స్వర్ణయజ్ఞోపవీతం చ కాఞ్చనం చోత్తరీయకం
రుద్రాక్షమాలాయా యుక్తం దదామి స్వీకురు ప్రభో
శ్రీ కేదారేశ్వరాయ నమః యజ్ఞోపవీతతోత్తరీయే సమర్పయామి

